# బూర్గుల రామకృష్ణరావు

# హరికథ

# బూర్గుల

# రామకృష్ణరావు

# పీఠికలు

జ్యోతిర్మయి
సాహిత్య సాంస్కృతిక సమితి
సికింద్రాబాద్ - 80

ప్రథమ ముద్రణ : జూన్ 1995

ప్రతులు : 500

వెల : రూ. 20/-

ముఖపత్రం : రఘువర్మ

ప్రతులకు : 1. జ్యోతిర్మయి
సాహిత్య సాంస్కృతిక సమితి
6-3-23/2, న్యూ బోయిగూడ,
సికిందరాబాద్-500 080.
ఫోన్ : 822728

2. బూర్గుల రంగనాథరావు
3-4-139, బర్కత్‌పుర,
హైదరాబాద్ - 500 027.
ఫోన్ : 614919

---

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహకారంతో ప్రచురితం.
ఈ గ్రంథంలోని రచయిత అభిప్రాయాలతో విశ్వవిద్యాలయానికి
ఏలాంటి సంబంధం లేదు.

# తొలిపలుకు

రాజకీయ దురంధరులు, బహుభాషాకోవిదులు, సాహితీవేత్తలు, తెలంగాణమునకే కాక యావదాంధ్రమునకు చైతన్యము ప్రసాదించిన మహనీయులు కీ.శే. బూర్గుల రామకృష్ణరావుగారు. సంస్కృత, ఆంగ్ల, ఉర్దూ, ఆంధ్ర భాషలలో వారు విరచించిన కృతులను వారి కుమారులైన రంగనాథరావు గారు ఎంతో పరిశ్రమించి సాహితీ జగతికి అందించినారు. వివిధ దశలలో వారు రచించిన కవితలను సంకలించి 'నివేదన'గా (1994) జ్యోతిర్మయి, సాహిత్య సాంస్కృతిక సమితి పక్షాన వెలువరించటం జరిగింది.

రామకృష్ణరావుగారు కవిగానే కాక పరిశోధకులుగా, విమర్శకులుగా ప్రతిభా పాటవాన్ని వెలార్చినారు. వారి లేఖిని నుంచి వెలువడిన సారస్వత వ్యాసాలే దానికి సాక్ష్యాలు. వివిధ రచయితల గ్రంథాలకు వారు సమకూర్చిన పీఠికలు కూడ వారి భాషా సాహిత్య పరిజ్ఞానానికి, బహుశాస్త్ర వైదుష్యానికి నిదర్శనాలుగా నిలచివున్నాయి. వాటికి కూడ సమీకరించి సంకలనంగా కూర్చితే ఉపయుక్తంగా ఉంటుందన్న ఆలోచనకు ప్రతిరూపమే ఈ గ్రంథం.

ఈ పీఠికల ప్రచురణకు ఆర్థిక సహకారం అందించిన తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథం గారికి, జ్యోతిర్మయి సంస్థ పక్షాన గ్రంథ ప్రకటనకు అవకాశం కల్పించిన బూర్గుల రంగనాథరావు గారికి, తమ అమూల్యాభిప్రాయము నొసగిన ఊట్ల కొండయ్యగారికి, ముద్రణలో తోడ్పడిన గణేశ్‌కు (మాధవీ ప్రింటర్స్), ముఖపత్రాన్ని రూపుదిద్దిన రఘు వర్మకు హార్దిక కృతజ్ఞతలు.

**డా॥ ఎస్వీ రామారావు**
(అధ్యక్షులు, జ్యోతిర్మయి)

# భార్గవుల రామకృష్ణరావు రచనలు

1. కృష్ణశతకము
2. పుష్పాంజలి (శతకము)
3. తొలిచుక్క (కవితలు)
* 4. నివేదన (కవితలు)
* 5. కవితా మంజరీ (సంస్కృతం)
6. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము (సంస్కృతం, తెనుగు)
* 7. సారస్వత వ్యాస ముక్తావళి
* 8. పారశీక వాఙ్మయ చరిత్ర
9. ఆంధ్రమహాభాగవత సమీక్ష (హిందీ)
10. The Dream of a Poetess
11. Random Reflections
12. Cultural Syntheses of India

## అనువాదములు

13. పండిత రాజ పంచామృతము
14. కనకధారా స్తవము
15. సౌందర్యలహరీ
16. సర్మద్ గీతములు
17. ఉమర్ ఖయ్యాం

* గుర్తు కలవి మాత్రమే లభ్యములు.

# చంద్రునకొక నూలుపోగు

వెనుకటి తరానికి చెందిన విద్వాంసులు, ప్రసిద్ధ రచయితలునైన రాజకీయ నాయకులలో అగ్రశ్రేణికి చెందినవారు డాక్టర్ బూర్గుల రామకృష్ణరావు గారు. కవిగా ఆయన వారికంటె ఒక మెట్టెక్కువ ఎత్తున వున్నారు. బహుముఖ ప్రజ్ఞా సుందరుడైన ఈ కోవిదుడు ఆంధ్రుడు కావడం మన భాగ్య విశేషం. బహుకాలం చీలివున్న ఆంధ్ర జన కుటుంబాన్ని ఒక నీడపట్టున చేర్చుటకై తనంతతాను ముఖ్యమంత్రి పదవినుండి తొలగి, తన త్యాగమును ఆంధ్రుల సమైక్యతా భోగమునకు సాధనము చేసిన ఋషి ఆయన. ఈ ఆంధ్ర సత్పుత్రుని మేధావితను ప్రత్యక్షరమూ ప్రదర్శించే రచనలను సమకూర్చి, వెలువరిస్తూవున్న వారి పుత్రసత్కవి శ్రీ బూర్గుల రంగనాథరావుగారూ, వారి కన్నివిధాలా చేదోడుగ వున్న ఆచార్యులు బిరుదు రామరాజు, యస్వీ రామారావు గారలు తెలుగు వారికి అభివందనీయులు.

పీఠికల రూపంలో ఆయా సందర్భాలలో వెలువడిన ఈ వ్యాసాలు, ఆయా విషయాల సమీక్షావ్యాసాలంటే సరియైన మాట. కొందరి సాహిత్య ప్రసంగాలు వింటే, సాహిత్య వ్యాసాలు చదివితే, వారు మనకు చెప్పదలచు కొన్నదేకాక, చెప్పజాలనిది కూడా తెలుస్తుంది. బూర్గులవారి వ్యాసాలు చదువుతూవుంటే, సముద్రం ఒడ్డునుండి లోపలికి నడుస్తున్నట్లుంటుంది. కొంత దూరం వెళ్ళిన తరువాత మునిగిపోతాం; కొట్టుకుపోతాం; మనం వుండం, సముద్రమొకటే వుంటుంది. అంత అగాధమూ అంత విశాలమూనైనది వారి విద్వత్తు, విషయజ్ఞత.

ఈ గ్రంథంలో పది పుస్తకాలను గూర్చిన సమీక్షలున్నాయి. ఏ విషయాన్నిగూర్చి చెప్పినా ఆయన దానికి సంబంధించిన సకల పరిజ్ఞానాన్నీ పాఠకుని ముందు రాశిపోస్తారు; అవి విజ్ఞాన సర్వస్వములవంటివి. పాఠకుడు మరొకచోటికి పోనక్కరలేదు. లాయరుగా, గ్రంథాలయ - ఆంధ్రోద్యమ - స్వాతం

త్ర్యోద్యమ నేతగా నిరంతరాయంగా అనేక రూపాలుగా పాటుపడుతూవుండే ఈ మహనీయునకు, ఇంత వైదుష్య సముపార్జనకు ఎలా తీరుబడి కలిగిందా అని ఆశ్చర్యం కలుతుంది. పైగా అడపాదడపా కవితా రచనమున్నూ.

విద్వాంసులలో - శాస్త్రాన్ని ఉన్నది ఉన్నట్లు చెప్పేవారు, దాన్ని వ్యాఖ్యానించి చెప్పేవారు, దానిపై తాము తేల్చిన నిగ్గును తెలపేవారూ అనే మూడు రకాలు వుంటారు. చివరికోవకు చెందిన విద్వాంసులే మేధావులు; వీరి వల్లనే శాస్త్రం విశాలమవుతుంది; వృద్ధి అవుతుంది. డాక్టర్ బూర్గులవారు ఈ మేధావుల తరగతికి చెందినవారు కావడంచేతనే గజల్‌ల సమీక్షావ్యాసంలో, మానవ జీవితములో శృంగారమునకు నైసర్గిక ప్రాధాన్యము కలదని, అందు వలన దానిని సాహిత్యమునుండి బహిష్కరించు యత్నములెక్కడను చిర కాలము సాఫల్యము పొందలేదని మాట నొచ్చకుండ నిక్కచ్చిగ చెప్పగలిగారు. మేఘ సందేశానువాదాన్ని గూర్చిన వ్యాసంలో ఈ పనిలో వున్న సాధక బాధకా లన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పారు. సంస్కృత కావ్యాలను ఆంధ్ర పద్యములలోనికి తర్జుమా చేసేటప్పుడు తెలుగు ఛందస్సు అడుగడుగునా అడ్డుపడే నిజాన్ని ఆయన ఎరుగుదురు. బూర్గులవారి నాట్యశాస్త్ర పరిజ్ఞానం కూడా అరుదైనదే ఈ సందర్భంలో, తెలుగువారికి గర్వకారణమైన మాట ఒకటి స్మరించుకోవలసి వున్నది, డా॥ పోణంగి అప్పారావుగారు మనకు నాట్యశాస్త్రాన్ని విప్పి చెబితే, నటరాజ రామకృష్ణగారు, శిల్ప విన్యాసాలనుండి పేరిణి తాండవాన్ని సృష్టించిన నాట్యాచార్యుడు, నాట్యస్రష్ట.

శ్రీనాదుని గూర్చిన చర్చలో, ఒక కవితను వ్రాసినదానికి, లేక చేసిన కల్పనకు అతనినే ఉదాహరణగా చెప్పడంలోని అనౌచిత్యాన్ని బూర్గులవారు బ్రద్దలుకొట్టారు. యజ్ఞత్వాన్ని చెప్పేటప్పుడు, ఆ జ్ఞాన ప్రక్రియయొక్క ఆరో హణను, గీతా శ్లోకార్థ వికాసనాన్ని సోపానాలుగా నిర్మించి చూపగలగడమనేది ఆయనకే చెల్లింది. సర్వజ్ఞ వచనాలపై వ్యాసం, వారి కన్నడ సాహిత్య చరిత్ర సర్వజ్ఞతను వెల్లడించింది. శివరాత్రి ప్రభల ఊరేగింపులలో, కొంతకాలం క్రిందటివరకు శ్రోతలను హర్షాతిశయంలో, తన్మయత్వంలో ముంచివేస్తూ ఆవేశ తరంగాలుగా 'రక్షరక్ష, దక్షరక్ష' పల్లవితో పాడబడుతూవుండిన వచ నాలు ఇంచుమించుగ నేటి మన సాహిత్యం రీతులనుండి కనుమరుగైపోయినట్లు తోస్తున్నది. మన అదృష్టంకొద్ది, తాను కవిని కానని చెప్పకొనే మహాకవి

ఆచార్య బిరుదు రామరాజుగారిటీవల తమ సత్యశోధి వచసాల ద్వారా, ఈ కవితారీతికి ప్రాణంపోసి పుణ్యంకట్టుకొన్న మాట మనం అందరం ఎరిగినదే.

డాక్టర్ బూర్గులవారి పీఠికలలోని, మహేంద్రోదయం, రామాయణము, దుందుభి, భారతము గ్రంథాలపై వ్యాసాలుకూడ సాహిత్య లోకానికి మరెన్నో నూతనాంశాలు వెల్లడిస్తున్నాయి. ఇలాంటి సాహిత్య సమీక్షాగ్రంథాలు విశ్వవిద్యాలయాల పాఠ్య గ్రంథ నిర్ణేతల దృష్టిలో పడవలసిన అవసరం ఎంతయినా వున్నది. అఖండ సాహిత్య పరిజ్ఞాన మహాస్రవంతిని సుసంపన్నం చేసే ఉపనదులైన జీవ ప్రవాహాలీ గ్రంథంవంటివే.

ఆంధ్ర సాహిత్య చరిత్రలో చిరస్వరూపాన్ని సంధానించుకొన్న విద్యత్కవి, విమర్శకాగ్రేసరుడు డాక్టర్ బూర్గుల రామకృష్ణరావుగారి దివ్య సాహితీ యశస్సుకు, ఇది చంద్రునికి నూలుపోగువంటిది.

ఊట్ల కొండయ్య

# తప్పు ఒప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 5 | కసీగా | కసీదా |
| 7 | 1 | వినోవికాసము | మనోవికాసము |
| 36 | 13 | యనంతరిగి | యనంతగిరి |
| 37 | 14 | మాత్రమేమెరుగుదుడు | మాత్రమేయెరుగుదురు |
| 38 | 16 | రుతిచూరు | తిరుచూరు |
| 40 | 25 | ఏదియెట్లున్నడు | ఏదియెట్లున్నను |
| | | శ్రీరామగారి | శ్రీ రావుగారి |
| 45 | 21 | నిశ్వనిత | నిశ్వసిత |
| | 24 | మహోరుయషే | మహోరుషేయ |
| 51 | 23 | వినరవేమా | వినరవేమ |
| | 25 | కుసకు | కొసకు |
| | 28 | పురాణ కథలకు | పురాణ కథలును |
| 52 | 25 | వచనములదెల్ల | వచనములందెల్ల |
| | 26 | ఆవతిల్లు | ఆవహిల్లును |
| 53 | 13 | మాటలకు | మాటలను |
| | 20 | విషయములకు | విషయములను |
| | 22 | లలరారు | యలరారు |
| | 24 | వచనముల | వచనములకు |
| 54 | 5 | కూరియుండు | కూర్చొనియుండు |
| | | సగుణాత్ముకుడగు | సగుణాత్మకుడగు |
| | 15 | రాయిపలభడుడు | రాయివలె జడుడు |
| | 24 | ఫలమునకు | ఫలమును |
| | 28 | యందు జ్ఞానము | యందజ్ఞానము |

# విషయ సూచిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 55 | 2 | తలంపుడు | తలంపడు |
| | 7 | ముఖ్యమైనది కులమత తత్వము | కుల మత తత్వ |
| | 17 | ఔత్తరాహులుడు | ఔత్తరాహులు |
| | 19 | గర్గి | గట్టి |
| | | డంబాచారములకు | డంబాచారములను |
| | | వైషమ్యలముకు | వైషమ్యములను |
| 56 | 7 | వారికిదివరకే | వారిదివరకే |
| | 14 | దేఘవ | దీర్ఘ |
| | 15 | పీటికను | పీఠికను |
| | 16 | విరమించుచున్నాం | విరమించుచున్నాను |

# ప్రస్తావన

శ్రీదాశరథి బాల్యమునుండియే ప్రతిభావంతమైన కవితను వ్రాయుచు ఆంధ్రలోకమునకు సుపరిచితులయినారు. ఆయన కవిత చాలకాలమునుండి నా హృదయము నాకర్షించుచు వచ్చినది. 'మహాంధ్రోదయము'న నీయువ కవి వ్రాసిన ప్రతి కావ్యఖండము చదువగ చదువగ నమృత గుళికవలె హృదయానందకరముగ నుండును. మహాకవి కాదగుట కనువైన కవితా బీజము లీకవిలో వర్ధిల్లుచున్నవనుట కీకావ్యము ఒరగల్లుగా నున్నది. తెలంగాణమునుగూర్చి యీ కవి యాలపించిన గేయములు, పద్యములు కర్ణపేయముగా నున్నవి. రాష్ట్ర స్వాతంత్ర్యోద్యమములో దేశమునకు దూర మున నుండక మాతృభూమి పారతంత్ర్య విముక్తికై తన కవిత ద్వారా అమోఘమైన కృషి సలిపి కారాగారవాస క్లేశములను గూడ ననుసరించిన దేశభక్తుడు దాశరథి. ఆంధ్రసాహిత్యలోకమునకు మకుటాయమానులయిన కీ. శే. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి కీ కావ్యము నంకిత మొనర్చుట ఈ కవిశేఖరుని యుచితజ్ఞతను చాటుచున్నది. ఇందలి కావ్యఖండములలో తెలంగాణా, శిల్పి, తెలంగాణా విముక్తి, తెలంగాణా తల్లి, పౌషలక్ష్మి, కపోతీసందేశము, మంజీర యనునవి నిసర్గ భావవాహులై కావ్యమంతయు మహాస్రవంతి వలె నత్యంతాహ్లాదకరంబై యలరారుచున్నది. రచన, శైలి మున్నగునవి యీ కవి సాహిత్యవ్యుత్పత్తిని, రసభావాలంకారాదులు ప్రతిభా విశేషమును చాటుచున్నవి. బాల్యమునుండియు కవితాభ్యాస మొనర్చుచున్న ఈ కవితా తపస్వి కావ్యము సహృదయ హృదయానందకరముగ నున్నదనుటలో నతిశయోక్తి లవమైనను లేదు. ఈయన యితోధికముగ రచన లొనర్చి ఆంధ్రకవి శిరోమణియై తెలుగు పొలమును మహాకావ్యోద్యానములచే వెలయించుచు చిరతర కీర్తిని గడించుగాక !

హైదరాబాదు
30-8-1955

# దాశరథి గాలిబ్ గీతాలు

## పీఠిక

మీర్జా అసదుల్లాఖాన్ 'గాలిబు' ఉర్దూ మహాకవులలో నిర్మకుట చక్రవర్తి. ఆ మహాకవి ఉర్దూ గీతములను గొన్ని దెనిగించి యాంధ్ర పాఠకలోకమున కందించిన యువమిత్రులు శ్రీమాన్ దాశరథిగారు మిగుల ప్రశంసనీయులు. అనువాదకు లాధునికాంధ్ర సుప్రసిద్ధ కవులలో నుత్తమ శ్రేణికి జెందిన రససిద్ధులు. వారి ఓజఃపూర్ణమగు లేఖిని తెలంగాణా స్వాతంత్ర్య సమర దుందుభిని మ్రోగించుటయేగాక, 'మహాబోధి' మున్నగు చారిత్రక సాంస్కృతిక స్మృతిపథములను మార్మోగించినది. రసధునియగు వారి కవితాఝరి నలువంకల బ్రవహించుచు, సాహితీ ఖండికలను సస్యశ్యామల మొనరించుచున్నది. స్వతంత్ర రచనా పాటవముగల ప్రతిభావంతులు నేడరుదుగా ననువాదక్షేత్రమున గాలిడుదురు. కాని శ్రీ దాశరథిగారి వంటి సాహితీ మధులోలుపులగు రసికుల కేభాషయందైనను గావ్యరసము కొల్లలుగా లభించును. అన్వేషణమే ముఖ్యము. శ్రీ దాశరథిగారిని వారి సరిక్రొత్త సాహితీ ప్రణయమునకై యభినందించుచున్నాను. వారు ప్రేమపూర్వకముగా నన్నొక పీఠిక వ్రాయవలయునని కోరినందున, ఉర్దూభాషానభిజ్ఞులకని ముఖ్యముగా నీ పరిచయ వాక్యములను వ్రాయుచున్నాను.

'గాలిబు' మహాకవి పేరు మిర్జా అసదుల్లాఖాన్. ఇతని పూర్వీకులు తుర్కీదేశస్థులు. ఈరాన్ యొక్క యాక్రమణానంతరము తూరానీయుల రాజ్యసంపదలు మంటగలసి ఈ తెగల వారందరు వివిధ ప్రాంతములందు చెదరిపోయిరి. కత్తిగట్టి బ్రతుకుటయే వంశధర్మమగుటచే, నతని తాత మొగలాయి చక్రవర్తి షాః ఆలం కాలములో సమర్‌కంద్ నుంచి ఢిల్లీకి వచ్చెను. అప్పటికే మొగలుసామ్రాజ్యము పతనదశకు జారుచున్నందున చక్రవర్తి కేవలము 50 గుఱ్ఱములు, నగారా, నిషాన్ మున్నగునవియును, నాసిబ్బంది ఖర్చులకును స్వంతఖర్చులకును పూసా (Phusa) పర్గణాను జాగీరుగాను నొసంగెను. ఆతని పుత్రులిరువురు - మిర్జా అబ్దుల్లాబేగ్ ఖాన్, మిర్జా నస్రుల్లాబేగ్ ఖాన్. వీరిలో పూర్వోక్తుని ప్రథమ పుత్రుడే మిర్జా అసదుల్లా ఖాన్. తండ్రి ఆగ్రాలో వస

యత్తవారింటి యిల్లటపుటల్లుడై యుండుటచే 'గాలిబు' జన్మస్థలము ఆగ్రా యైనది. అతడు 1212 హిజ్రీ (క్రీ.శ. 1795) సంవత్సరమున (8) రజ్జబునాడు జనించెను. ఆరవయేటనే తండ్రి మరణించినందున మిర్జా ఆసదుల్లా ఖాన్ తన తమ్ముడగు మిర్జా యూసుఫ్‌ఖాన్‌తో సహా మాతామహులింట కొన్నాళ్ళు గడపి, పిదప పినతండ్రియగు నస్రుల్లాఖాన్ యొక్క పోషణలో నుండెను. పితృచ్ఛాయా విహీనుడయ్యెను, నైసర్గిక ప్రతిభావంతుడైన మిర్జా చిన్ననాటి నుండియే సాహితీ సామ్రాజ్యము నేలు చిహ్నములను ప్రకటించుచు వచ్చెను. పదు నాల్గవ యేట, బాల్యావస్థయందే 'హుర్ ముజ్దు' అను పేరుగలిగి యిస్లాం మత మును స్వీకరించి 'అబ్దుస్సమద్' అను నామములో ప్రసిద్ధిగాంచిన యొక పారసీక మహాపండిత కవియొక్క సాహచర్యము లభించినది. నైసర్గిక ప్రతిభగలిగిన, 14 సంవత్సరములు గల యీ బాలునికి పారసీక భాషా సాహిత్యములం దనితర సామాన్యమగు పాండిత్య మలవడినది. 'గాలిబు' స్వయముగా ఫారసీ తన మాతృభాష కాకపోయినను, జన్మతః తన కా భాషాసాహిత్యములపై ప్రేమా భిమానములు మెండనియు, నా భాష తనకు విధేయమనియు సగర్వముగా చెప్పు కొన్నాడు. నిజముగా నతని ఫారసీభాషా సాహితీపాటవ మతనిచే సృజింపబడిన గద్య పద్యాత్మకములగు ఫారసీ రచనలందేగాక, నతని 'ఉర్దూ' రచనయందు గూడ నత్యంత ప్రభావసమన్వితమై గోచరించును అతని కాలమునకు బూర్వమే ఢిల్లీలో పోషితమైన 'ఉర్దూయెమొ అల్లా' అను అరబ్బీకృత ఫారసీకృతమైన ఉరుదూభాష పరిణతినిజెంది, ఇన్‌షా, ముస్హఫీ, నాసిఖ్, ఆతిష్, మోమిన్, జౌక్ వంటి ప్రతిభావంతులగు కవుల కీర్తి కాస్కారమై విరాజిల్లినది. వీరిలో కొందఱు 'గాలిబు'కు సమకాలికులైన సుప్రసిద్ధకవులు. 'గాలిబు'ను ఉర్దూ కవి యనుటకంటె ఫారసీకవియని యనవలెనని యతని సమకాలికులు గొందఱు గావించిన విమర్శ కతని ఫారసీ పక్షపాతమే కారణము. మొదట 'గాలిబు' కఠినములై, యితర పండితులచే క్లిష్టములనియు, నసాధువులనియు పరిగణింప బడు నెన్నియో ఫారసీ సమాసముల నుపయోగించి, కొందఱు సమకాలికుల వెక్కిరింతలకు గూడ పాత్రుడయ్యెను. అతని పాండితీ వైదగ్ధ్యములను మెచ్చు కొనువారును మెత్త మెత్తగా నతని ఈ ప్రవృత్తిని మార్చుటకై యొత్తిడి గావించిరి. తన సహజశైలికిని, ధోరణికిని విరుద్ధములైన యా విమర్శలను తొలుదొల్త ప్రతిఘటించినను, తరువాత కాలవాహిని కెదురీదలేక కొంతమార్పు నంగీకరించెనని 'గాలిబు' యొక్క తరువాతి రచనలు చెప్పక చెప్పుచున్నవి.

'గాలిబు' తన ఉరుదూ రచనలను దన జీవితకాలముననే కొందఱు సహృదయులగు మిత్రులకు ప్రకటనార్థ మొప్పగించెను. క్లిష్టార్థములు గలిగి జనరంజకములు కాజాలని రచనలను వదలివేసి, వారు ఏరికూర్చిన దీవాన్ (పద్యసంపుటి)ను 1849లో ప్రకటించిరి. అందులో మొత్తము 1800 పాదములు గలవు. వానిలో 1500 గజళ్ళను, మిగతవన్నియు కసీగా, మస్నవీ, రుబాయీలు మున్నగునవి. ఏరికూర్చిన దీవాన్ నందును కొన్ని గజళ్ళు నేడును అయఃపిండములనియే పరిగణింపబడుచున్నవి. 'గాలిబు రచనల కర్థమేలే'దని యొక సమకాలిక కవి గావించిన విమర్శనమునకు 'న సితాయెష్‌కి తమన్నా, న సిలేకీపర్వా - న సహీ గర్ మెరె అష్ఆర్ మె మానీ న సహీ'

ఏ పొగడ్తలగోర నే నేరికడను
లెక్కజేయను బహుమతుల్ జిక్కకున్న
నాదుకవితల నర్థమేలేదయేని
లేకపోనిమ్ము! అద్దాని లెక్కజేయ

నని సమాధానము జెప్పినాడు. కాని సమకాలికుల విమర్శలు న్యాయములు కావనియు 'గాలిబు' యొక్క విశృంఖలమైన జీవితమువల్లను, రచనాపద్ధతి వల్లను వెగటొంది వ్రాసినవ్రాతలనియు, నామహాకవికి జీవంతుడై యుండగ, తదనంతర మత్యధికముగాను ఫారసీ ఉరుదూ సాహిత్య ప్రపంచమున గలిగిన ప్రశస్తివలన తేటతెల్లమగుచున్నది. 'గాలిబు' కవియును సాధారణముగా దన సమకాలికుల రచనలపై మెప్పులు గుప్పువాడు కాడు. అపూర్వమైన యర్థ గౌరవమునో, పదరామణీయకమునో, లేక భావౌన్నత్యమునో వ్యక్తపరచు కవి తనే, తన మనసుకు హత్తినచో, నెత్తి పొగడువాడు అందరికి 'గాలిబు' మెచ్చుకోలు నిచ్చువాడుగాడని దురభిప్రాయము. అందువలననే కొందఱు విమర్శనకు గురి యొనర్చిరేమో యని తోపకమానదు. ఐనను తరువాత, సహృదయులగు సాహిత్య వేత్తలును విమర్శకులునగు 'హాలీ' 'ఆజాద్' వంటి మహా పండితులచేతను, ఇతర మహాకవులచేతను కవితా స్వామ్రాజ్యమునకు పట్టము గట్టింపబడిన తన యశస్సును చిరస్థాయిగా స్థాపించుకొన్నాడు 'గాలిబు'. ఏబది సంవత్సరముల కాలము ఫారసీ సాహిత్యవీధుల సంచరించి, అన్వరీ, ఖాఖానీలకు

సరిదూగు కసీదాలను, 'ఉర్ఫీ', 'తాలిబు'ల కంటె మిన్నయగు గజళ్ళను, ఉమర్ ఖయ్యాంతో మేళవించు రుబాయీలను, అబ్దుల్ ఫజల్, జుహూరీ మున్నగువారి గద్యలను పేలవములుగా గన్పింపజేయు గద్యకావ్యములను రచియించెను. ఉరుదూలో ముఖ్యమగు 'గజల్' కవితా సరణిని తీర్చిదిద్దిన యగ్రసరుడు 'గాలిబు'. ఆ మార్గమునందే కొన్ని క్రొత్త యడుగులు ద్రొక్కుచు కాలాను గుణమగు పరివర్తిత ప్రవృత్తులచే ప్రభావితులై, 'దాగ్', 'హస్రత్', 'ఫానీ', 'జిగర్' మున్నగు తరువాతి కవులు 'గజల్' కవితకు వన్నెబెట్టిరి. అందు వలననే 'గాలిబు' యొక్క మహత్వము నిర్వివాదాంశము.

అసమాన ప్రతిభాసంపన్నుడైన 'గాలిబు'కు కవిత వెన్నతో బెట్టిన విద్య యని చెప్పకతప్పదు. రెండేండ్లు ఒక మహాపండితుని సాహచర్యము లభించిన దంతియేగాని 'గాలిబు' సక్రమముగా నే గురువులయొద్దను సాహిత్యమును, శాస్త్రములను చదువుకోలేదు. పదమూడవయేట వివాహమైనపిదప ఢిల్లీ నగరమునకు వచ్చి, ఆమరణాంత మక్కడనే నివసించెను. వంశాభిజాత్యమును, స్వాభిమానమును నిలువబెట్టుకొనుట కెన్నియో కష్టములకు బాల్పడియెను. పిన తండ్రి జాగీరునుండిగాని, మాతామహుని యాస్తినుండిగాని 'గాలిబు' యొక్క జీవితావసరములు తీరలేదు. పినతండ్రియాస్తికి సంబంధించిన పెన్షన్ కొరకు ప్రీవీకౌన్సిలు వరకు అప్పీళ్ళు చేసినను సంవత్సరమునకు 750 రూకల కంటె మించి లభించలేదు. మొగలుదర్బారులో బహాదుర్‌షా నెలకు 50 రూప్యముల వేతనమునుమాత్రమే యిచ్చుచుండెను. కాని నిజాంజంగు, నజ్మొద్దౌలా, దబీరుల్‌ముల్కు అను ఖితాబుల నొసంగి సత్కరించెను. బ్రిటిషువారి పెన్షన్ 1857 లో మొగల్ రాజులతో సంబంధముగలిగి యున్నందున విద్రోహియను సంశయమునకు గురియై యాపివేయబడినది. మూడేండ్లపిదప సంశయమును తొలగించి తిరిగి జారీ చేయించుకొనువర కెన్నియో బాధలు భరించవలసి వచ్చినది. రాంపూర్ నవాబులును, ఇతర మిత్రులును తఱుచు సహాయము చేయుచుండిరి. కాని యప్పులకుప్ప లెప్పటికిని 'గాలిబు'ను తిప్పలు బెట్టుచుం డెడివే ఐనను పల్లకిని విడిచి నడవలేదు. ఇంటిబైటికి వెళ్ళక స్వగృహమున కారావాసమొనరించెను. కాని నౌకర్ల నెవరిని తీసివేయలేదు. వీలైనంత వరకు దాను రుచిమరిగిన మాంసాదులను, మధురములైన మామిడిపండ్లను

భుజించుట మానలేదు. వృద్ధాప్యమున చెవుడు ముదిరి ఎన్నో యిడుముల పాల య్యెను. కాని ప్రతిరాత్రి తానాస్వాదించు 'ఫ్రెంచి' మధువునుమాత్రము వదలలేదు. 1857 లో ఢిల్లీనగరమునుండి ముస్లిం లందఱు పాఱిపోయినప్పుడు 'గాలిబు' మాత్రము వెళ్ళలేక ఢిల్లీలోనే యుండిపోయెను అప్పుడతని మిత్రులగు హిందువులు సహాయమొనర్చిరి. దీర్ఘకాలము జీవించి ఢిల్లీనగరముయొక్క సౌకర్యములకును, సాంఘికాచారములకును అలవాటుపడిన 'గాలిబు' దన యవ సానకాలమును దయనీయస్థితిలో గడపెను. ఒకసారి జూదమాడుచుండ బట్టు బడి మూడు నెలలు కారాగారశిక్ష ననుభవించెను. సంతానహీనుడై, పెంచుకొన్న భార్యమేనల్లుండ్రుగూడ నతని యెదుటనే మృతింప, వృద్ధాప్యమున బహుదుఃఖ ములకు గురియయ్యెను. ఈ వివరము లన్నియు నతడు తన మిత్రులకును శిష్యులకును సహచరులకును దాపరికములేక దస్తజాబులలో దెలిపియున్నాడు. ఈ లేఖలన్నియు 'ఉర్దూయె మొఅల్లా' అను పేరుతో ప్రకటింపబడినవి. 'గాలిబు' ఢిల్లీనగరమున 15 ఫిబ్రవరి 1869 తేదీన, 74వ ఏట దివంగతుడయ్యెను.

ఉర్దూకవితలో 'గజల్' రచనా పద్ధతి రెండు వందల సంవత్సరముల క్రితము ప్రారంభమై, ఈశతాబ్దారంభమున హాలీ ఎక్బాల్ మున్నగువారచే నిర సింపబడి, అభ్యుదయ మార్గోన్ముఖులగు నవీన సాహిత్యోపాసకులచే బహిష్కరిం పబడి కొంత గౌరవమును గోల్పోయినను, నేటికిని ఉర్దూ కవితా రంగమున ప్రధానమైన పాత్రనే ధరించుచున్నది. 'గజల్' శృంగారరసాత్మకమైన నిసలైన భావకవిత. దీని కాధారములు రెండు. ఒకటి కవియొక్క రాగ రంజితమైన హృదయమును స్పృశించు అనుభూతులు. రెండవది భావనా ప్రపంచములో విచ్చలవిడిగా విహరించి, వానిని రమణీయ వాగర్థ ప్రతిపాద కములుగా చిత్రించు ప్రతిభావ్యుత్పత్తులు. శృంగారరసమునకు నైసర్గిక ప్రాధాన్యము కలదని మానవస్వభావవేత్త లెఱిగిన విషయమే. అందువలననే సాహిత్యమునుండి శృంగారమును బహిష్కరించు ప్రయత్నము లెక్కడను చిరకాల సాఫల్యమును బొందలేదు. కొంతకాల మదుపులో నుంచిన నుంచ వచ్చును. కొంత సంస్కరింపనువచ్చును. కాని దానిని వెలివేయుటకు వీలు లేదు. ఉర్దూసాహిత్యమునందెన్ని మార్పులు కలిగినను 'గజల్' యొక్క ప్రాధాన్య మందువలననే తగ్గలేదు. పై పెచ్చు జాతీయజీవనములోను, సాంఘిక వాతావరణములోను, కాలానుగుణ్యముగా గలుగు మార్పులు దూపొందించు

వినోవికాసము 'గజల్' కవితాసరణియొక్క పరిధులను విశాలమొనరించి, విప్రలంభశృంగారమును ప్రేయసీ ప్రియుల విరహపీడల నధిగమింపజేసి దాని హద్దులను విస్తరించినది. ఉపరిదృష్టిచే జూచినచో 'గజల్' యొక్క ఇతి వృత్తమునందును, తత్ప్రతిపాదనయందును రెండువందలయేండ్లకాలములో మౌలికమైన ఏ మార్పు కనబడదనియే చెప్పవలసియుండును. ఐనను కేవల మాంతరికానుభూతులపై నాధారపడియున్నందున, వికసిత మనోవృత్తుల పరిణత భావములను వ్యక్తీకరించుట కనువగు సరణి 'గజల్' కవితలో నాధునికుల కలవడినది. జాతీయ భావోద్రిక్తులైన కవులకు స్వాతంత్ర్య సమర దుందుభిని మ్రోగించుటకు సౌకర్యము నొసంగినది. అభ్యంతరికానుభూతి ప్రధానమగు నీ కవితలో భావప్రకటనమునందెన్నో మెఱుగులు దిద్ది, వన్నెలచే నలంకరించి, యర్థగౌరవమును సంపాదించుట కవకాశముగలదు. విప్రలంభ శృంగారమును ప్రధానాంశముగా గ్రహించి, ప్రేయసితోడను, సాకీతోడను, దేవునితోడను, స్వగతముగాను, ప్రపంచముతోడను పలువిధములుగ ముచ్చటించవచ్చును. ఛందోబద్ధమై యంత్యప్రాస నియములను పాటించవలసియున్నను, ప్రతి పాదము స్వతంత్ర భావార్థప్రతిపాదకమై యుండుటవలన, కవికి మరింత స్వైర విహార మొనర్చుటకు సుకరముగా నుండును. కాని యంతర్దృష్టితోపాటు రస పరిప్లుతహృదయమును, కల్పనాశక్తితోపాటు అర్థగౌరవము గల వాక్పాటవ మును జతగూడినగాని నిజమగు 'గజల్' నిర్మాత కానేరడు. 'గాలిబు'లో నీగుణసమన్వయము పరిణత దశలో ప్రసిద్ధములై యుండినవనుట నిస్సందేహము.

'గజల్' నిర్మాత యొక్క యంతర్దృష్టికి ప్రధానములైన యంగములు కల్పనాశక్తి, భావుకత. అసాధారణములైన యనుభూతులకును, పరిమిత దృష్టిచే స్పృశింపరాని సత్యములకును కల్పనాశక్తి జీవన్మూర్తిస్వరూపము నొసంగి, బుద్ధిని ఆశ్చర్యపరవశమొనర్చు నూతన సృష్టిని గావించును. కాని యట్టియనుభూతులును, సత్యములును స్పష్టముగావ్యక్తపరచుట కనువైనవిగావు, వాని వ్యక్తీకరణయందు కొంత యస్పష్టత, గొంత రహస్యము, వ్యంగ్యము, యుండకతీరదు. ఒక యవనిక, ఒక ముసుగు అత్యావసరము. శృంగా రానుభూతులను వ్యక్తపరచుటయందు వ్యంగ్యమునకును, ధ్వనికి [illegible]

ప్రాధాన్యముగలదు. ప్రేమికునికిని ప్రేయసికిని ఈ 'పర్దా' సమానముగా నవసరమగును. ఉర్దూ కవు లీయాథార్థ్యమును స్పష్టముగా నంగీకరించిరి. ఈ వ్యంగ్యమునకు పునాది కవియొక్క ఆంతరికానుభవముగాని బాహ్యానుభూతి కాదు. అందువలననే 'గజల్' నిర్మాత ప్రపంచసౌందర్య విలాసమును దన కాల్పనిక చిత్రములందు స్వయముగా జూచుచు నితరులకును ఆ ప్రకాశము నాకింత పంచియిచ్చును. ఈ విధములగు ననుభూతులందు భావోద్వేగమునకును కల్పనాశక్తికిని అవినాభావ సంబంధముండుటచే, భావప్రపంచమునందు కల్పన, మఱియు వాస్తవికతయను రెండింటికిని భేదము నశించును. అనుభవించు వానిలోను, అనుభూతవస్తువునందును ద్వైత్వము నశించి ఐక్యత సాధింపబడును. 'గజల్' కవితకు బాహ్యానుభూతులు గూడ పునాదులనుట సత్యమేయైనను, ప్రతిభాశాలురైన 'దాగ్', 'జురఅత్' వంటి కవులును దమ కల్పనాశక్తిని కేవల బాహ్యానుభూతులను జాగ్రుతము లొనర్చుటకై యుపయోగించినందున వారికవిత యంతరాంతరమునుగాని, యాధ్యాత్మిక సత్యమునుగాని స్పృశించుటకు సమర్థముకాలేదు. 'మీర్', 'గాలిబు', 'మోమిన్', 'హస్రత్' మున్నగు మహా కవుల రచనలు అట్లుగాక అంతరికానుభూతి ప్రధానములై, వ్యంగ్యధ్వని పూరితములై, బాహ్యాభ్యంతరములగు నిరుతెగల భావనాపరంపరలను స్పృశించునవై, యున్నత శ్రేణికి జెందుచున్నవి. ఉత్తమశ్రేణికి జెందిన 'గజల్' లో బాహ్యాను భూతియు నాంతరికమై పరివర్తన మొందుచున్నది. బాహ్యప్రపంచమే కవి యొక్క భావనాప్రపంచముతో నైక్యమును బొందుచున్నది. హాఫిజు, సాదీ, బేదిల్ మున్నగు ఫారసీ కవులతోపాటు, 'మీర్', 'సౌదా', 'గాలిబు' 'హస్రత్', 'జిగర్' మున్నగువారి రచనలలో, బాహ్యప్రపంచమంతయు మానవుని యభ్యంతర దృష్టియొక్క ఛాయాచిత్ర మనుభావ మత్యంత సుస్పష్టముగాను విరివిగాను వ్యక్తీకరింపబడినది.

పారసీ, ఉరుదూ 'గజల్' కవితాసంప్రదాయములో విప్రలంభ శృంగారమునకే ప్రాధాన్యము గలదు. ఈ శృంగారమునకు పునాదియైన ప్రేమ 'హకీకీ' యని, 'మజాజీ' యని రెండు తరగతులకు జెందినదిగా పరిగణింపబడినది. 'మజాజీ' యనగా సాధారణమగు లౌకికమగు నాయికానాయకుల ప్రేమ. 'హకీకీ' యనగా భగవద్భక్తి, లేక పారలౌకిక ప్రేమ. విప్రలంభశృంగారము

ఈ రెండింటికిని సామాన్యమైన రసము. కాని కొందఱు సూఫీకవులు, భక్తులు, ఖ్వాజామీర్ దర్ద్, న్యాజుబరేల్వీ మున్నగు ఉరుదూ కవులుతప్ప, సాధారణముగా 'గజల్' నిర్మాతలగు కవులందరి వలపు 'మజాజీ' లౌకికమనునది నిర్వివాదాంశము. వారెన్ని ముసుగులను వేసినను, వారి ప్రేయసి సుకుమారావయవయైన సుందరియే. వారు గోరుచుండు రసము గోస్తనీరసమే. వారి వర్ణనలు, వ్యంగ్యములు, ధ్వనులు, విరహము, విప్రలంభము, శోకము, ఎత్తిపొడుపులు, నిందలు, అన్నియు మానవశృంగారమునకు సంబంధించినవే. ఐనను ఉచ్చశ్రేణికి జెందిన 'గజల్' నిర్మాతల వ్యంగ్యధ్వని ప్రధానములగు రచనలు తరచుగా 'హకీకీ', 'మజాజీ' యను రెండర్థములకు దావలములై, యుదాత్తభావములను వ్యక్తీకరించునవై సహృదయుల నాకర్షించుచుండును. అట్టి యుదాహరణము లనేకములు 'గాలిబు' రచనలలో లభించును. ఈ ప్రేమ లౌకికమా పారలౌకికమా, కవిసంబోధించు ప్రేయసి సౌందర్యరాశియగు చంద్రముఖియా, లేక సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మమా యను సందేహమునుగూడ గలిగించుచుడును. ఈ ప్రక్రియ ఫారసీ ఉరుదూ కవితా సంప్రదాయమునకు గల యొక విశిష్టమైన గుణము. ప్రేయసిని నిర్దేశించుటయందును సౌందర్య ప్రతిపాదకములగు 'గుల్' 'సరోకద్' 'మాఃవష్' 'బుత్', 'కాఫర్' మున్నగు పదముల నుపయోగింతురు. ఇవి 'పంకజాక్షి' 'చంద్రముఖి' వంటివి. లేక గుణ ప్రతిపాదకములగు 'బేవఫా', 'జాలిం', 'సితంగర్' మున్నగు పదముల నుపయోగింతురు. 'చమన్', 'మై', 'బుల్బుల్', 'సాకీ' మున్నగునవి యుత్ప్రేక్షాసామగ్రిగను, చషకము, పానశాల మున్నగునవి యంగములుగను ఉపకరించును. పూర్వాచారపరాయణుడగు 'జాహెద్' కవి నిర్మలప్రేమకును తన్మయత్వమునకును ఆటంకములు కల్గించువాడని యతనిని నిందించుట, వెక్కిరించుట కవి సంప్రదాయము. ప్రేయసి ఎల్లప్పుడు దయావిహీనురాలై ప్రేమికుడగు కవిని విరహాగ్ని జ్వాలలో కాల్చుచుండును, అత డెల్లప్పుడశ్రుధారలగార్చుచు, ప్రేయసిని, దైవమును, కాలమును దూరుచుండును, ఒకప్పుడు ప్రార్థించును, ఒకప్పుడు నిందించును. మఱొకప్పుడు తనను తానే నిందించుకొనును, ఒకప్పుడు తన హృదయవేదన నొక దైవదత్తమగు వరముగా నాహ్వానించి స్వాగత మొసంగును, ఒకప్పుడు ప్రాతకాలపు వలపును స్మరించి, ఇప్పటి నిరాశను దలంచి విశ్వసించును. వేయేల, విప్రలంభ శృంగార

మును స్పృశించు నసంఖ్యాకములగు మధుర భావములను వ్యక్తపరచును. ఈ వైవిధ్యము, కల్పనాచాతురి, అర్థగౌరవము, కవియొక్క ప్రతిభావ్యుత్పత్తులపై నాధారపడియుండును. సాధారణులైన 'గజల్'నిర్మాతలు పూర్వకవులచే వ్యక్తీకరింపబడిన భావములనే చర్వితచర్వణముగా బ్రకటించినను, శబ్దార్థములందేదో నూతనత్వమును, విశిష్టతను, చాతుర్యమును జూపుటకై ప్రయత్నించుచుందురు. ఈ రంగమున బూర్వకవుల యనుకరణమును వదలి 'గాలిబు' మహాకవి ఎన్నో క్రొత్త పోకడల నవలంబించెను. కేవల శృంగారమునకే గాక జీవితరంగమునందలి వివిధానుభూతుల వ్యక్తీకరణమందొక యపూర్వమైన నూతనత్వమును ప్రకటించెను. అదే 'గాలిబు' యొక్క ప్రత్యేకత.

ఈ పీఠికను ముగించుటకు ముందు మచ్చునకు మాత్రము గొన్ని పద్యముల నుదాహరణముగా నిచ్చుట యసమంజసముకాదు. అనేక జీవిత సమస్యలపై 'గాలిబు' దన పరిణత మనోభావములను వ్యక్తీకరించినాడు. ఒకచోట

ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదులెమ్ము
నరుడు నరుడౌట యెంతొ దుష్కరము సుమ్ము !

అన్నాడు. జీవితములో నేపనియు సుసాధ్యము కాదనుట యొక నగ్నసత్యము. కాని రెండవ పాదమందలి యుపమ దాని నొక యున్నతమైన నైతిక స్థాయికి గొనిపోయి యుదాత్త మొనర్చినది.

ఎన్నో సుఖసంపదలను వాంఛింతుగాని
మృతియెలేకున్న రుచిలేదు బ్రతుకునందు

అన్నాడు కవి. ఎన్నో వాంఛలు, వానిని పొందుటకై చేయు ప్రయత్నములు మానవునికి సహజములే. కాని మృత్యువనునది లేనిచో నా వాంఛలందును, వాని ప్రాప్తియందును రుచియేలేదు. జీవితమున కంతము దగ్గరగానున్నదను భావమే వాంఛల కొరకశక్తిని, వాని ప్రాప్తికొక సుఖమును ఇచ్చుచున్నది. మృత్యువే లేనిచో నారుచిలేదు. ఇది యొక యపూర్వభావము.

మానవుని యుత్కృష్టతను, సృష్టిలో నతనికిగల ప్రాధాన్యమును కవి ఖురాన్‌యొక్క కావ్యముతో ధ్వనింపజేసినాడు. చూడుడు——

తూరుపైగాక మాపైన జారిపడియె
దివ్యకాంతుల పిడుగులు దేజరిల్లి
పానశాలలో మధువును బంచుచుంద్రు
కోరువారల పాత్రల మేరవరకె.

ఖురాన్‌యొక్క ఆయత్‌లో (వాక్యములో) నిట్లున్నది- 'మా జ్యోతినిభూన్యాకాశములకును పర్వతములకును భరించుటకై యిచ్చెదమంటిమి. కాని యవి భరింపజాలనందున మానవున కిచ్చితిమి. అచలమైన తూరుకొండకు (మూసాకు జ్ఞానోదయమైన పర్వతము పేరు 'తూరు') దివ్యజ్యోతిని భరించు శక్తిలేనందున నది మానవుని సొత్తైనది ఎవరిశక్తి ననుసరించి వారికి దేవుడిచ్చును. పానశాలలో నభ్యర్థికి వాని పాత్రలో నెంత మధువుపట్టునో అంతే సాకీ పంచియిచ్చునని యుపమించినాడు కవి. విశ్వములో మానవునికి గల యుత్కృష్టతను చాటినాడు 'గాలిబు'.

పరమేశ్వరునితో నే విధముగా సరసములాడుచున్నాడో యీ క్రింది, పద్యమున జూడుడు___

(ఆతాహై దాగె హస్రతె దిల్‌కా షుమార్‌యాద్
ముఝ్‌సే మెరేగునః కా హిసాబ్ ఆయె ఖుదా ! నమాంగ్)
ఏనొనర్చిన పాపంబు లెన్నటంచు
లెక్కనడుగకు మోదేవ ! ఒక్కసారి
మఱల నెడదను గాల్చినమచ్చలెల్ల
స్మృతిపథంబున బడి లెక్క చెప్పుమనును.

నీవు నా పాపముల లెక్కనడిగినచో నా హృదయముపై దగిలిన గట్టి గాయముల మచ్చలను గూడ లెక్కింపవలసి యుండును. అవి స్మరణకు రాగలవు. రెండును అసంఖ్యాకములే ! ఎందుకీ బాధ ! అన్నాడు కవి.

షరియొక్క తాత్విక సత్యమును ఈ క్రింది పద్యమున వ్యక్తీకరించినాడు,

దర్శనంబయ్యెనని దేని దలచుచుందు
మది నిజంబుగానె అదృశ్యమైన యదియె;
స్వప్నమందున మేల్కొన్న జాగరూకు
డెట్లు మేల్కొను ? నిదురించియే పరుండు.

సర్వాంతర్యామియని యెఱింగి ప్రపంచమున నేశక్తిని మనము జూచు చున్నామో యది చక్షురింద్రియమున కగోచరమై యతీతమైనది. మనము చూచుచున్నామని భావించుట స్వప్నములో మేల్కొనినట్లు కలగనిన వాని జాగరూకతకాని నిజమైన మెలకువ కాదు. ఇది యొక యుదాత్తమైన యాధ్యాత్మిక సత్యము.

మరియొక విచిత్రమైన యుదాత్తభావము—

దుఃఖమధికమైన దుఃఖంబె నశియించు
నరునిబాధలెల్ల నాశమౌను
కష్టజాలమెంత గ్రమ్మెనో నా పైన
నంత సులభమయ్యె నదియె నాకు.

దుఃఖానుభవము పరాకాష్ఠస్థాయికి జేరినపు డది దుఃఖముగా నుండదని కవి మరియొక చక్కని భావము—

నీదు కలయిక సులభమ్ము గాదు ! సరియె !
కష్టమేమన, కష్టమ్ము గాదు గూడ !

ఈ ప్రేమ యాధిభౌతికమైనను నాధ్యాత్మికమైనను కవి భావము స్పష్టము. 'నీ సమాగమము సులభము కాదనినచో (దుస్సాధ్యమనినచో) నాశవదలుకొని కూర్చొనియుందును. కాని యది కష్టము (దుస్సాధ్యము) కానందున నేనెల్లప్పు డాశాబంధము తెగిపోవక కుమిలిపోవుచుందును, అని యభిప్రాయము.

దైవభక్తి నిర్వ్యాజమై యుండవలయునను భావము నీ పద్యమున చక్కగా నొక్కి వక్కాణించినాడు.

నాకమును బట్టి ద్రోయు డానరకమందు
నచట భక్తుని కమృతంపు టాశలేదు.

స్వర్గముయొక్క అమృతము నాశించి భక్తుడు దేవుని పూజించుచున్నాడు. ఆ స్వర్గమును నరకమందు ద్రోసినచో నా భక్తుని కాశలేని భక్తియలవడును.

'గాలిబు' గీతములందు మనోహరములగు భావములు, విచిత్రములగు కల్పనలు, అపూర్వములగు నుపమానములు కొల్లలుగా లభించును. గ్రంథ విస్తర భీతిచే ననువాదకుల తెలుగు సేతనుండి కొన్ని హృదయంగమములైన పద్యముల నీ క్రింద పొందుపరచుచున్నాను.

వలపువలన బ్రతుకు బహురుచ్యమైనది
ఎడద తీయదనము బడయసాగె
బాధ కౌషధమ్ము బడసియు డెందంబు
మందులేనిబాధ నందె మరల.

చిత్రగుప్తుడువ్రాసిన మాత్ర మనము
పాపులగుదుము ; సాక్షి యెవ్వండుకలడు ?

నేను మరణింప నామె దుఃఖాన కుమిలె
ఎంత తొందరగా కరుణించె నన్ను?

నా యెడదచీల్చి రక్తమండలము సేసె
నేను వేదనతో మరణించినాను ;
ఇపుడు గోళ్ళకు నెరుపురంగెట్టులెక్క
వెలది తాను గోరింటాకు పెట్టకున్న!

స్వీయలోపమ్ము లెరుగుట పెద్దవిద్దె;
లోపమెరిగినవాడె పూర్ణుడగు నరుడు.

ఆమె తోటకు వాహ్యాళి కరిగెనంట
ఇంక తోటలో పూలు వాంఛించునెవడు ?

భ్రుకుటి క్రిందుగ నయనమ్ము పోల్కి గురువ!
ఆలయముపంచలనె పానశాల వలయు.

స్వాస్థ్య మెడలిన మందిచ్చువాడు వలదు
ప్రాణములుపోవ నేడ్చెడివాడు వలదు.

ద్వారబంధములును తలుపు తాళములేని
ఇరుగుపొరుగులేని ఇల్లు వలయు

మాటలాడువాడు మందలించెడువాడు
నెవడులేనియెడ వసింపవలయు.

అందకత్తెలతో మాటలాడుగొరకు
చిత్రలేఖనవిద్య నేర్చితిని నేను.

హరిని ప్రార్థింప తలవంచినట్లుగానె
బాగ త్రాగి మ్రొక్కుము మధుభాండమునకు.

ఆమెపాదతీర్థ మాన గోరితిగాని
కాళ్ళు నేలమీద గడిగెనామె.

ప్రేయసి గృహవీధి స్పృహతప్పి పడిపోయి
ముదిత కాలిగురుతు ముద్దుగొంటి.

శాస్త్రవైద్య కత్తిసైతము రక్తాశ్రు
కణములొలికె, నీవు కరుగవేమె?

నాదు గుండెగాయము కుట్టు సూదికంట
అశ్రుజలధార దారమై అవతరించె.

ఎచట నీ పదాంకములు నీక్షింతు, నచట
అడవి ధారియ్యు నందనమట్లు తోచు.

నాకొరకు నీవు వత్తువన్న యది నిజము,
జాగు సేయవటన్నది సత్యమగును,
అసలు నావార్త నీ కందునంతలోన
మట్టిలో నేను కలిసెడి మాట నిజము.

గాలిబా ! నీదు తాత్వికకలన, యహహా!
త్రాగకుండిన నిను మేము యోగియనమె!

చింతిలెడు మాకు బ్రహ్మాండమెంతొ ఇరుకు
అందు గగనమ్మొక పిపీలికాండమయ్యె!
వేరునందుండి కొమ్మలు వెలసినట్టు
లన్ని శబ్దాలు నిశ్శబ్దమందె పుట్టె.
పానశాలయె లేనిదేదైననేమి
బడి, మసీదు, సత్తరువు సర్వమ్ము నొకటె.

ఇంతటితో నుదాహరణములను, నా యుపోద్ఘాతమును ముగించుచు శ్రీ దాశరథిగారి కృషికి సహృదయాంధ్ర పాఠకలోకము సహర్షముగా స్వాగత మొసంగగలదని విశ్వసించుచున్నాను.

రాజ్ భవన్
లక్నో
12-3-1961

# శ్రీ ఆత్మానందస్వామి ఆంధ్ర మేఘసందేశము

## తొలి పలుకు

కవికుల గురువగు కాళిదాసు గత 1500 సంవత్సరముల నుండి నేటి వరకు కావ్య ప్రపంచమున కనిష్ఠికాధిష్ఠుడగు మహాకవి. కాళిదాసు నతిశయించు టెంతవానికేనియు నసాధ్యమైన పని. అంతేకాదు ఆ మహాకవి ననుసరించుటయు అనువదించుటయును దుష్కర కార్యములే. 'మేఘసందేశము' కావ్య ప్రపంచ మందొక నూతన కల్పనగా రూపొంది విశ్వసాహిత్యమం దప్రతిమాన ప్రతిభచే నలరారుచున్నది. దూత కావ్యములందు లలామభూతమై అపూర్వమైన యొక కావ్య సంప్రదాయమును స్థాపించినది.

ప్రథమరస ప్రధానమై ఇతర రస ప్రకర్షానుకూలమై కవియొక్క కల్పనా చాతుర్యమునకును, ప్రకృతి వర్ణనా సామర్థ్యమునకును అనంతావకాశ మును కల్గించు దూత కావ్య మనేక సంస్కృత కవుల నాకర్షించినది. అనేక కవులు తదనుకరణములగు కావ్యములను రచించిరి. కొందరు శృంగారమును ఆనుషంగికముగా లేక ప్రధానముగానే పోషించి కథావస్తువును మాత్రము భక్తి వైరాగ్య సమన్వితమగునట్లుగా మార్చిరి. దాదాపు సంస్కృత వాఙ్మయమున నిట్టి దూత కావ్యములు నలువది సంఖ్య వరకు గలవని వినికిడి. పదునాలుగు పదునైదు కావ్యముల నల్పజ్ఞాన సంపన్నుడగు నేనే ఎరుగుదును.

కాళిదాస మహాకవి యొక్క మహాకావ్యముల కన్నింటికిని వ్యాఖ్యాత మల్లి నాథసూరి యగుట యాంధ్రుల మహద్భాగ్యము. అందువలన సహజ సహృద యులగు యాంధ్ర కవులను మేఘసందేశ మాకర్షించుటలో నాశ్చర్యములేదు. అందలి బాహ్యాభ్యంతర సౌందర్యముల నాస్వాదించు టెంతకష్టమో 'మాఘే మేఘే గతం వయః' యను మల్లినాథుని సూక్తియే చెప్పుచున్నది. ఐనను మేఘ సందేశముయొక్క యాంధ్రానువాదములు క్రీ శ. 18వ శతాబ్దినుండియే వెలసి నవి. కొటికలపూడి వెంకటకృష్ణ సోమయాజి, పద్దాది సుబ్బారాయుడు, వత్స వాయి వెంకట నీలాద్రిరాజు, కల్లూరి వెంకటరామశాస్త్రి మున్నగు వారెందరో తమ పద్యానువాదములను ప్రకటించిరని వింటిని కాని వానిలో కొన్ని ప్రస్తుత

మనుపలభ్యములు. గత సంవత్సరమున రెండు ఆంధ్రానువాదములు నేనెరిగినంత వరకు ప్రకటింపబడినవి. శ్రీమన్నవ వెంకట రాధాకృష్ణశర్మగారు 'మేఘసందేశము'ను పద్యములలో ననువదించి ప్రకటించిరి. భారతి పత్రికలో 'దూత మత్తేభమ'ను శీర్షిక క్రింద యతిప్రాస నియమములను నిర్బంధముగా పాటింపక మఱియొక కవి మత్తేభ వృత్తములలో రచించిన సుందరమగు యనువాదము ప్రకటింపబడియెను. ఈ విధముగా సహృదయులగు కవులనేకులకు మేఘసందేశము నేటికిని అనుకరణయోగ్యమును అనువాదార్హమునగు మహోత్కృష్ట కావ్యముగా నుపకరించుచున్నది.

ప్రస్తుతాంధ్రీకరణము శ్రీ ఆత్మానంద యతీంద్రులవారి సరస కవిత కాలవాలమైన రచన. అనువాదకులు శ్రీ జ్ఞానానంద స్వాములవారిని గురువుగా వరించి సంయములై ఆత్మానందానుభూతిని గడించుచున్న యతులు. వారి గురువులు ఆధ్యాత్మికాధిభౌతికోభయ విద్యా విజ్ఞానవేత్తలగు శ్రీ జ్ఞానానంద యతీంద్రులు. నేషనల్ ఫిజికల్ లాబొరెటరీకి ఉపాధ్యక్షులు. శ్రీ ఆత్మానంద స్వాములు 'నిర్వచనాంధ్ర గీతాభాష్యము'ను కూడ రచించిరి. దయతో వారు తమ రచనల చిత్తు పొత్తములు నాకందించి తమ 'ఆంధ్ర మేఘ సందేశము'నకు తొలిపలుకు వ్రాయమని యాదేశించిరి. ఆ యాదేశమే నన్నీ 'తొలిపలుకు' వ్రాయుట కధికారిని గావించినదికాని నా యర్హతకాదు.

స్వతంత్ర కావ్యముల రచించుటకంటె యనువాద కావ్యములను వ్రాయుట మిగుల ప్రయాసతో గూడినపని. అనువాదము మూలానుసారిగా నుండవలయును. మూలములోని యక్షర రమ్యత, భావగాంభీర్యము, రసపుష్టి, వ్యంగ్యము, ఉచితాలంకారములు మున్నగు నేగుణములును లోపింపకూడదు. అనువదితమైన భాషయొక్క నుడికారమును జీవమును యనువాదములో ప్రతిబింబింపవలయును. మూల కావ్యములో గల యస్పష్ట భావములును యంతరార్థములును వ్యంగ్య ద్యోతకములగు భాగములందు తప్ప విస్పష్టముగా వివరింపబడవలెను. అనువాదమైనను పాఠకులకు స్వతంత్రమైన రసవత్కావ్యముగా స్ఫురింపవలెను. శ్రీ ఆత్మానంద స్వాములవారి ఈ 'ఆంధ్ర మేఘ సందేశము' పైన యుల్లేఖింపబడిన సర్వ సుగుణములచే నలరారుచున్నది. మూలము నతిక్రమించుట కేవల భావ విస్పష్టత కొరకు మాత్రమే జరిగినది. అదియు పాఠ

కులకు సహాయకారి. యగునంతవరకే మూలములోని సద్గుణములను సంపూర్ణ ముగా పరిపోషించు నుద్దేశ్యముతో నొక శ్లోకము యొక్క యనువాదము నొకే పద్యమునందుగాక రెండు రెండు పద్యములు పూర్తిచేసిరి. అనువాదములో పద్య సంఖ్య హెచ్చినను తెనుగు వాక్యములకు వన్నెదెచ్చు సీసములను గీతములను విరివిగా నుపయోగించినందున నీ యనువాద మొకస్వతంత్ర కావ్యముగనే స్ఫురించుచున్నది.

ఉభయ భాషావేత్తలును, ప్రతిభావంతులగు కవులును, ఆర్ష విద్యాభూష ణులును బ్ర॥ శ్రీ॥ జటావల్లభుల పురుషోత్తములు గారు తమ యుపోద్ఘాతమున నీ యుత్తమానువాదముయొక్క ప్రాశస్త్యమును వెల్లడించుచు దిగ్దర్శన ప్రాయ ముగా గొన్ని యుదాహరణములను మాత్రమే యిచ్చియున్నారు. అడుగడుగు నకు నీ కావ్యమునందట్టి యుదాత్తగుణములే కనుపడుచుండుటచే తద్రసాస్వాద నము పాఠకులకే వదలుట యుక్తమని తలంచుచున్నాను. మల్లినాథ సూరి సహాయములేకయే మేఘసందేశముయొక్క సుధాతిస్వాదుత్వము ననుభవించు టకును కాళిదాసు హృదయమును తెలిసికొనుటకును శ్రీ యాత్మానంద యతీం ద్రుల యాంధ్రీకరణ మత్యంతోపయుక్తమగు సాధనమనుటలో సందియము లేదు. శైలి యొక్కొకచోట నన్నయను, ఒక్కొక్క స్థలమున తిక్కనను, మరొకచోట పోతనామాత్యుని స్మరణకు దెచ్చుచున్నది. ఈ యుత్తమ కావ్య మాంధ్రావని మన్ననలందుకొనుగాక.

పోణంగి శ్రీరామ అప్పారావు

# నాట్యశాస్త్రము

భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రమునకు 'నాట్యవేద' మనునామాంతరము గలదు. భారతీయములగు సకలశాస్త్రములకును సర్వ విజ్ఞానమునకును వేదము లాధారభూతములు -

ఋగ్యజుస్సామవేదోభ్యో వేదాచ్చాధర్వణక్రమాత్
పాఠ్యం చాభినయం గీతం రసాన్ సంగృహ్య పద్మజః
వ్యరీరచ చ్ఛాస్త్రమిదం ధర్మకామార్థ మోక్షదం

అను సూక్తి ప్రకారము దేవతల ప్రార్థన నంగీకరించి, చతుర్వేదములను స్మరించి, చతుర్ముఖుడు పాఠ్యాభినయ సంగీత రసములను వాని నుండి గ్రహించి, ధర్మకామార్థమోక్షద మగు నాట్యవేదమును రచించి ప్రయోగార్థము భరతముని కొసంగెనని నాట్యోత్పత్తిని గురించిన ప్రాచీన విశ్వాసము. తాండవ లాస్య రూపనృత్తములను శివపార్వతులగు నాదిదంపతులే ప్రథమ నర్తకులై ప్రయోగించిరని భారతీయులు విశ్వసించు గాథ. అదెట్లున్నను, భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రము నాట్య, నృత్త, నృత్య త్రివిధాత్మక నాట్యకళకే గాక, కావ్య - సంగీత శాస్త్రములకును ప్రాతిపదికమైన వేదము. ప్రాచీనములగు మన నాట్యాభినయ కావ్యాలంకార లక్షణశాస్త్రము లన్నింటికిని, చిత్రలేఖనము మున్నగు లలిత కళలకును మూలభూతములగు సిద్ధాంతము లీభరతముని ప్రణీత నాట్యశాస్త్రములో గలవు. భారతీయ చతుష్షష్టి కళలకు వేదము లందును, ఇతర శాస్త్రములందును పునాదులేర్పడియున్నవి. ఈ యాధారము పైననే ప్రాచీనులు చిరకాలాభ్యాస ప్రయోగానుభవముచే శాస్త్ర విజ్ఞానసౌధమును నిర్మించి కొన్ని శాస్త్రములందు పరాకాష్ఠను పొందిరి. వీనిలో నాట్యశాస్త్రము, సంగీతశాస్త్రము, అలంకారశాస్త్రము ముఖ్యములైనవి. ఈ శాస్త్రములందు

ప్రాయోగిక పరిశోధనలను సల్పుచు జిజ్ఞాసువులగు పండితులు మూడు నాలుగు శతాబ్దముల క్రిందివరకును సమాలోచనలు విమర్శలు జేయుచు నూతన సంప్రదాయములను విధానములను కనిపెట్టి పరిణత దశకు తీసికొనివచ్చుచునే యుండిరి.

మధ్య కాలీనమగు పారతంత్ర్యము, సాంస్కృతిక దాస్యము మున్నగు వాని వలన భారతీయ విజ్ఞానము కుంటుపడి పెఱుగుదలలేక యాగిపోయినది. పాశ్చాత్య విజ్ఞాన నాగరికతా సంఘర్షణలచే చకితులమై నూతన సిద్ధాంతములను, సంస్కృతిని అలవరించుకొనుటతో కొంతకాలము గడచినది. స్వాతంత్ర్య సంపాదనానంతరము, అంతకు పూర్వమునుండియే పాశ్చాత్య పండితులచేతనే తిరిగి వెలుగులోనికి తేబడిన మన సాంస్కృతిక రూపములు, ప్రాచీన విజ్ఞానము కళా సంప్రదాయములు మరల నేటి ప్రజాస్వామ్య యుగమున పునర్వ్యాప్తి జెందుట కవకాశము లభించుచున్నది. ప్రపంచమున నేడు విస్తరించుచున్న భిన్న భిన్న శాస్త్ర కళా సంప్రదాయముల ప్రభావము పరివర్తనశీలమగు ప్రజాసంస్కృతిపై బడుటయనివార్యము. పురాణమిత్యేవ నసాధుమన్యే యని ప్రాచీనార్యోక్తియే కలదు. ఐనను దేశకాల పాత్రానుగుణముగా రావలసిన మార్పులు సనాతనములగు జాతీయవిజ్ఞాన సంప్రదాయముల పునాదులపై ఆధారపడినచో వానికి సుస్థిరత్వము చేకూరును. 'క్రొత్త ప్రాతల మేలు కలయిక' ను సృష్టించుచున్న ఈ కాలమున, పండితులకే కాక పామరులకును ప్రాచీన శాస్త్ర రహస్యముల పరిచయము గలిగించుట మిగుల యవసరము.

భరతముని ప్రణీత నాట్యశాస్త్రమును 'నాట్యవేద' మను పేర బ్ర॥శ్రీ॥ జమ్మలమడక మాధవరామశర్మగారు మిగుల సమర్థతతో తెనిగించి, యా శాస్త్రాంతర్గతములగు వివిధ సమస్యలను సోపపత్తికముగా చర్చించియున్నారు. ఆ గ్రంథముయొక్క ప్రథమభాగము సంగీతనాటక అకాడమీవారి ప్రోత్సాహ సహాయమువలన ముద్రితమైనది. దానిని చూచు భాగ్యము నాకు లభించినది. శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు 'తెలుగు నాటకము యొక్క ఉత్పత్తి పరిణతు' లను గురించి రెండు సంవత్సరములుగా ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు పరిశోధన సలుపుచున్నారు. తద్గవేషణ ఫలితముగా వీరును భరతమహర్షి ప్రణీతమగు 'నాట్యశాస్త్రము'ను సమగ్రముగా అనువదించినారు

తెనుగు వచనానువాదముతోపాటు అధస్సూచికలలో అభినవగుప్తాదుల యభిప్రాయములను, మరియు ప్రతి యధ్యాయాంతమున కొన్ని విశేషాంశములను చేర్చినారు. ఇతర లక్షణ గ్రంథములతో పోలికలను సూచించుచు గ్రీకు నాటకి రంగమును గూర్చిన వివరములను కూడ పొందు పరచినారు. బహుముఖ విజ్ఞానదాయకమగు నీ గ్రంథమును అచ్చొత్తించుటకై ఆంధ్రప్రదేశ ప్రభుత్వము ప్రోత్సాహ సహాయముల నొసంగుట మిగుల ప్రశంసనీయము, సంతోషకరము. నేను చూచిన ముద్రిత గ్రంథభాగ మాకర్షణీయముగా నున్నది. పూర్తిప్రతి సర్వాంగ సుందరముగా నుండునని విశ్వసించుటకు సందేహములేదు. యువకులగు గ్రంథకర్తలు శ్రీ అప్పారావుగారు ఆంధ్రావని కమూల్యసాహితీసేవ గావించిరనుట యతిశయోక్తి కాదు, వారిని హృదయపూర్వకముగానభినందించుచు వారి కితోధిక పరిశోధనమున కావశ్యకమగు పట్టుదలను, గ్రంథరచనోత్సాహమును, వాని ముద్రణ ప్రకటనల కవసరములగు సర్వవిధసౌకర్యములను పరమేశ్వరుడనుగ్రహించుగాత మని నా యాశీస్సుల నందజేయుచున్నాను.

జనవరి 1959

విళంబి - సంక్రాంతి

తిరువనంతపురము

# చిలుకూరి పాపయ్యశాస్త్రి

# శ్రీనాథుని కవితా సమీక్ష

తాము రచించిన 'శ్రీనాథ కవితా సమీక్ష'యను గ్రంథము నందుకొని మిగుల సంతసించితిని. ఈ గ్రంథమునందు శ్రీనాథుని కవిత నొక ప్రత్యేక దృక్పథము ననుసరించి సమీక్ష గావించునటులు తాము ఆముఖమునందేగాక పలుతావుల నిర్దేశించియే యున్నారు. కీ. శే. కందుకూరి వీరేశలింగంపంతులు గారును, వేటూరి ప్రభాకరశాస్త్రిగారును శ్రీనాథుని శృంగారిగాను స్త్రీలోలుడుగాను తుదకు 'వేశ్యాలోలుడు'గాను నిరూపించియున్నందున, నా యఖండ శివభక్తుడును నత్యంత ప్రతిభావ్యుత్పత్తి సంపన్నుడగు మహాకవి కాపాదింపబడిన యీ కళంకమును తుడిచివేయుటయే ఈ గ్రంథ రచనకు తమను ప్రేరేపించిన యుద్దేశ్యము. ఈ యాశయమును నెరవేర్చుటకై తాము గావించిన సమీక్ష మిగుల సోపపత్తికమైనందున, శ్రీనాథునియెడ ననాదర భావము గలిగిన నెవరికైనను దమ యభిప్రాయములను మార్చుకొనుటకు నిస్సందేహముగా తోడ్పడగలదని విశ్వసించుచున్నాను.

తాత్త్వికముగా యోచించినచో నేకవికిని సాహిత్యకారునికిని అతని రచనలలో ప్రతిఫలించు ప్రధానరసభావసామగ్రి నాధారముగాఁగొని యతని వ్యక్తిగత జీవితమునకు తత్సంబంధితములగు ప్రవృత్తుల నంటగట్టుట యత్యంత సాహసకార్యమే గాక సాహితీ సమీక్షయొక్క సిద్ధాంతములకే వ్యతిరేకమైన పద్ధతి ననుసరించుట యగును ఈ పద్ధతి ప్రతిభాశాలురగు సాహిత్యోపాసకుల రచనా శిల్పమున కపార్థములు కల్పించుట కుపకరించునేగాని, వారి జీవిత చరిత్రముల యథార్థాంశముల నిదమిత్థమని నిర్ణయించుటకు సరిపోదు. యథార్థజీవిత చరిత్రాంశముల కితర ప్రమాణములు గాని యాధారములుగాని యుపలబ్ధమైనచో నా వ్యక్తియొక్క రచనలలో సువ్యక్తమగు ప్రధాన ప్రవృత్తులు నిశ్చితాభిప్రాయ నిరూపణకు బలము నొసంగజాలును. అంతియేగాని శ్రీనాథుడు గావించిన శృంగార వర్ణనలును వ్యక్తీకరించిన భావములును, ఆ మహాకవి 'శృంగారి' యని నిరూపించుటకును ఋజువుపరచుటకును సమర్థములు

కానేరవు. కావ్యములందలి పాత్రములచే సందర్భానుసారముగ వచ్చి శృంగార భావమును భాషను బలికించుటయును, సనాతన సాహిత్యాచార ప్రకారము స్త్రీల కచకుచనితంబా ద్యవయవ శృంగార వర్ణనము గావించుటయు, పాపమే యగుచో, నిష్కలంక ప్రథితయిశులగు మహాకవు లెందఱో శ్రీనాథుని సహ చరులుగా బేర్కొనబడవలసియుందురు.

కీ. శే. కందుకూరి వీరేశలింగంపంతులుగారు బ్రహ్మసమాజ స్థాపకు లలో నొకరగు సంస్కారప్రియులు. వారి సాహిత్యకాభిప్రాయములును తత్ప్రి భావ ప్రేరితములని భావించుట యన్యాయము కాదు. ఆంధ్రసాహిత్య చరిత్రము లోని ప్రబంధయుగమునఁ గొన్ని మిగుల జుగుప్సాకరములగు సంభోగ వర్ణనలుగల ప్రబంధములు గలవనుట నిర్వివాదాంశము. సహజముగా సంఘ సంస్కార ప్రారంభకులలో నొకరగు పంతులుగా రీకోవకు జెందిన సాహిత్య మును నిరసించెడివారు. సమకాలిక సంప్రదాయము ననుసరించి శృంగార రస నిష్పత్తికై శ్రీనాథుడు దన శివ కథామూలములగు నాలు కావ్యములందును సందర్భోచితముగా దన భావనా వైచిత్రిని సౌందర్యప్రియత్వమును వ్యంగ్యము గాను వాచ్యముగాను ప్రదర్శించినాడు. శ్రీనాథుడు నిజముగా రచించినవియును, నతనిపేర చలామణి యగుచున్న చాటువద్యములునుఁ గొన్ని వాచ్యాశ్లీలములు గలిగియున్నవి. అందువలన పంతులుగారు శ్రీనాథునికి 'శృంగారి' యను బిరుదమును ప్రసాదించిరి. శాస్త్రిగారు 'క్రీడాభిరామ' కర్త శ్రీనాథుడేయని తమ కుపలబ్ధమైన యాధారములనుబట్టి నిర్ణయించియున్నందున మఱింత నొక్కి శ్రీనాథుడు 'స్త్రీలోలుడు'ను 'వేశ్యాలంపటు'డనియు వక్కాణించిరి. తామీ సమీక్షయందు పెద్దలగు విద్వఱి పండితుల యభిప్రాయముల కేర్పడి యున్న పునాదులను సోపపత్తికముగా కదలించుటకు సఫల ప్రయత్నమునే గావించితిరని నా యభిప్రాయము.

శ్రీనాథుడు 'శృంగారి' 'స్త్రీలోలుడు' వేశ్యా ప్రియుడు' అని నిర్ణ యించుటకు, కేవల మా మహాకవియొక్క రచనలలో విరివిగాగానవచ్చు శృంగార రసపోషణము, స్త్రీ సౌందర్య సంభోగాది వర్ణనము, వారవనితా ప్రస్తావము మున్నగునవియే యాధారములైనచో ననేక సంస్కృతాంధ్ర కవిపుంగవు లీవిమర్శనకే గుఱియగుదురేమో? మహామహులగు పవిత్ర జీవులగు భక్తకవు

లెందరో నివ్విధమగు శృంగార రసోత్కర్షములగు కావ్యములను రచించిరి. శృంగారము నా మహాకవులు దమ కావ్యములందు పరిత్యజించలేదు. శ్రీ శంకర భగవత్పాదులు 'సౌందర్యలహరి' యందు నాపరాదేవిని స్తుతించునపుడు నఖశిఖా పర్యంత మవయవ సౌందర్యమును శృంగారము సిద్ధియగునటుల వర్ణించిరి. హరిహరుల మాయామానుషపు చేష్టలను వర్ణించిన కావ్యము లన్నింటి నిట్టి ఘట్టము లనేకములు గవు. 'భిక్షాటన కావ్యము' నందు శివుని దారుకావన విహార కథ విపులీకరింపబడి సకల శృంగారరస భరితముగాను వాచ్యాశ్లీలములని యనుకొనబడు వాచ్యాశ్లీలముతోను నిండియున్నది. తాంత్రిక పద్ధతిలో సామయికాచారులకు కామతంత్రముపాదేయముగా పరిగణింపబడుచున్నది. అందువలననే 'సౌందర్యలహరి'యందు శ్రీ శంకరు లీవిధముగ స్తుతించిరి.

నరం వర్షీయాంసం నయనవిరసం నర్మసు జడం
తవాపాఙ్గాలోకే పతిత మనుధావని శతశః
గళద్వేణీ బంధాః కుచకలశ విస్రస్తసిచయా
హఠాత్త్రుట్యత్కాంచ్యో విగళితదుకూలా యువతయః

కృష్ణభక్తాగ్రేసరుడును పద్మావతీ చరణ చారణ చక్రవర్తియగు జయదేవకవి నేమనవలయును ? జుగుప్సాకరములగు సంభోగవర్ణనాదు లొనర్చిన విజయవిలాస తారాశశాంక విజయ' కర్తలనుగూడ వారి రచనల యాధారముపై స్త్రీలోలుర క్రింద గట్టివేయుట సాహసమగును. క్షేత్రయ్య మువ్వగోపాల పదముల నాధారముగాఁగొని యతనికి కళంక మంటగట్టవలసినదేనా ? వారి రచనల నసభ్యములని విమర్శించినట్లు చేయవచ్చును. కాని వాని యాధారముపై వారి సత్ప్రవర్తనను శంకించి దోషారోపణ మొనరించుట న్యాయము కాదని నేను తమతో నేకీభవించుచున్నాను. శ్రీనాథుడు సౌందర్యప్రియుడు, శృంగార రసపోషకుడగు మహాకవి. సుఖజీవనాభిలాషి, సమకాలిక లౌకిక సాంఘిక కాచార విమర్శకుడు. పండితుడు, ప్రజ్ఞాధురీణుడుగా దన రచనలో ప్రతిఫలించుచున్నాడు తోడ్తోడనే యఖండ శివభక్తి పరాయణుడుగను ప్రతిబింబించుచున్నాడు. అందువలన శ్రీనాథుని స్వచరిత్రమును కళంకిత మొనర్చువాద మతివాదమనియు, నట్లు వాదించినధీమంతులు ప్రమాదమునకు గురియైరనియు నేనును భావించుచున్నాను.

5-3-1960
త్రివేంద్రం

# ఆత్మకూరు గోవిందాచార్యులు
# గోవింద రామాయణము
## పీఠిక

శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులవారు భారత స్వాతంత్ర్య సమర యోధులలో నగ్రశ్రేణికి జెందినవారు. సత్యాగ్రహోద్యమములలో పాల్గొని, యనేక సారులు కృష్ణజన్మస్థానము నలంకరించి, కాంగ్రెసు సంస్థ యొక్క అగ్రనాయకు లందరకును సుపరిచితులై వారితోడునీడగా వారితోపాటు సమర శంఖారావ మును పూరించి యువకుల దేశభక్తులకు మార్గదర్శకులై, త్యాగమయ జీవితమును గడిపిన నాయకులు. అనాసక్తి యోగము నాచరణపూర్వకముగా నవలంభించిన కర్మయోగులు, మానధనులు. త్యాగముతోపాటు భక్తి వారికి వెన్నతో బెట్టిన విద్య. అనువంశికముగా లభించిన ఆర్ష విద్యావాసనలు, సాహిత్య సంప్రదాయ ములు, భగవద్భక్తి ప్రపత్తులు, వారి సుగుణగణములలోని మేలిబంతులు. వారు రచించిన 'గోవింద రామాయణము' నకు తొలిపలుకు వ్రాయు గౌరవ సౌభాగ్య ములు నాకు లభింపజేయుటకు కారణము కేవలము వారి వాత్సల్యభావమే. వారికి సప్రశ్రయముగా నా నమోవాకములు సమర్పించుచున్నాను.

ఆదికవినాటినుండి నేటివరకు శ్రీమద్రామాయణ గాథ భారత దేశము నందు సుస్థిరమగు స్థానము నాక్రమించుకొనుటయే కాక సర్వ ప్రపంచమునందును విశ్వ సాహిత్యమందలి పరమోదాత్తమగు మహాకావ్యమనియు, ఇతిహాసమనియు సువిఖ్యాతమైనది.

యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే,
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి॥

అని భగవానుడగు బ్రహ్మ యుపదేశించి "కురు రామ కథాం పుణ్యాం, శ్లోక బద్ధాం మనోరమాం" అని ప్రాచేతసుల కాదేశ మొసంగినటులు శ్రీమద్రామాయణ

ములో తెలుపబడి యున్నది (బాలకాండ సర్గ 2 శ్లో॥ 36-37). కనుక రామ కథామృతము నెందఱెన్నెన్ని రీతుల నెన్నెన్ని పాకములలో నందించినను తక్కువే. పద్యకావ్యములు-ద్విపదలు-పాటలు - గేయములు-సంకీర్తనములు-ఎన్నియో కలవు. ఐనను రామ కథా కథనము ముక్తికారకమనియు, భవతారకమనియు విశ్వసించుచు శ్రీ ఆచార్యుల వారు 'గోవింద రామాయణ' రచనకు పూనుకొని మూడు కాండములను పూర్తి గావించి యున్నారు. మొట్టమొదట యుత్తరకాండ కథా భాగమును రచించి తరువాత బాలకాండమును వ్రాసి అయోధ్యాకాండమును 'పాదుకా పట్టాభిషేక'మను నామాంతరము నొసంగి మూడవ కావ్యముగా రచించియున్నారు. తమ రామాయణ రచనా ప్రయోజనమును రచయితలే ఈ క్రింది పద్యమునందు తెలిపియున్నారు.

చ॥ చదివిన పాండితీగరిమ సర్వము చాటగ గాదు. కాదహో !
ముద మలరంగ సత్కవిగ బూజల నొందగ గాదు, గాదహో !
సదమల సర్వశాస్త్రముల సారము శ్రీ రఘురాము పూజగా
హృదయ సమర్పణమ్మునదరింపదలంచి రచింప నెంచితిన్.

ఈ పవిత్రోద్దేశమును నెరవేర్చుకొనుటలో నాచార్యులవారు సఫల మనోరథులైరని నిస్సందేహముగా వచింప వచ్చును.

శ్రీమద్రామాయణము శ్రీ వైష్ణవ సంప్రదాయ ప్రకారము పరమోత్కృష్టమైన పారాయణ గ్రంథము. సకల కల్యాణగుణ సంపూర్ణులైన చక్రవర్తి తిరుమగనాల్ (శ్రీరామచంద్రుని) యందు మూర్తీభవించిన సుగుణగణములు మానవ జాతికే యాదర్శప్రాయములు. ప్రాచీన కాలమునుండి వేదోక్త మానవ ధర్మములను భారతీయ ప్రజలందు ప్రగాఢముగా నెలకొల్పి వ్యక్తిగత సాంఘిక జీవనమును కౌటుంబిక వ్యవస్థల నైతికాదర్శముల పై మలచుచు వచ్చినది రామాయణగాథ. దుష్టనిగ్రహము-శిష్టరక్షణ-సత్యవాక్పరిపాలన - పితృభక్తి - భ్రాతృప్రేమ ఏకపత్నీవ్రతము- పాతివ్రత్యము-క్షమ-దయ-శౌచము-శరణాగత రక్షణ మున్నగుమహోదాత్త సుగుణముల కాలవాలములైన ఉత్తమ వ్యక్తులు.

కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః ।
చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః
విద్వాన్ కః కః సమర్థశ్చక శ్చైక ప్రియదర్శనః ॥

'ఏత దిచ్ఛామ్యహం శ్రోతుం' అని నారద మునిపుంగవుని విచారించి వాల్మీకి మహర్షి రామ కథను తెలిసికొనెను. కాబట్టి రామాయణ కథలో మూర్తీభవించిన వ్యక్తులనేకసుగుణముల కారకములై న మహాపురుషులు-పవిత్రమూర్తులు. వారి చరిత్రల నభివర్ణించుటలో శ్రీ యాచార్యులవారు ఆదికవి ననుసరించియే గొప్ప యౌచిత్యమును ప్రకటించియున్నారు. కరుణారసము పొంగిపొరలు చుండు అయోధ్యకాండలో ననేక సన్నివేశములం దుదాత్తభావ పరిపోషణము చక్కగా గావించియున్నారు. ఇందు కుదాహరణములు గ్రంథమున కోకొల్లలుగా గలవు. గ్రంథ విస్తరభీతిచే వానిని పొందుపరచక సహృదయుల యనుభూతికై వదలుచున్నాను. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రకారము భక్తి జ్ఞాన వైరాగ్యములలో భక్తి ప్రధానమైనది 'యోమేభక్తః నమే ప్రియః'॥

సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ॥

అను గీతాంత సమాశ్వాస వచనము భగవద్గీతోపదేశము యొక్క కీలకము - సారాంశము. అందునుండియే 'శరణాగతి' 'ప్రపత్తి'యను ఆత్మ సమర్పణ సిద్ధాంత ముద్ధరింపబడినది. శ్రీమద్రామాయణ మీ సిద్ధాంతములను సోదాహరణముగా నిరూపించుచున్నది. కావుననే యాచార్యులవారు,

తే॥ భక్తిరసము పునాదిగాఁ బాదుకొలిపి
కట్టెదఁ బ్రపత్తి సౌధ మీకావ్యమందు

యని తమ యుద్దేశ్యమును వెల్లడించినారు. ముఖీయును

ఉ॥ ధీరమతిన్, బ్రపత్తిని ద్వదీయ పదాబ్జములందు మ్రొక్కి సం
సార మహాబ్ధితారణము, సర్వశుభాస్పద మంత్ర రాజమౌ
తారకమున్ జపించుచు, సదా హృది నిల్పుచు నిన్ను నీ మహో
దార కథా సుధాలహరిఁ దాండవమాడెద దన్మయుండనై॥

అని ప్రతిజ్ఞ యొనర్చినారు.

ఆచార్యులవారి రచన యనువాద మసలే కాదుగదా ! కేవల మనుసరణ మును కాదు. కథా కథనమును, రచనా విధానమును వీరి "స్వేచ్ఛానుగతిని" చాటుచున్నవి. నన్నయ, తిక్కన, పోతనాదుల విధానము ననుసరించి కథా సామగ్రిని రసావిష్కరణమున కనుగుణముగా నుపయోగించి రసవంతమగు స్వతంత్ర కావ్యమనదగునట్లు రచించియున్నారు. మూలమునం దయోధ్యా కాండము (119) సర్గలలో పూర్తియైనది. ఆచార్యులవారు కావ్యరచనాపద్ధతి ననుసరించి ఆరాశ్వాసములలో గ్రంథమును విభజించిరి. (1) రాజ్యాశ్వాసము (2) మాయాశ్వాసము (3) సత్యాశ్వాసము (4) భక్తాశ్వాసము (5) ప్రపన్నా శ్వాసము (6) పాదుకాశ్వాసము. ఈ యాశ్వాసముల శీర్షిక లయోధ్య కాండ మందలి కథా విషయములను రచయిత లేదృక్పథములో గమనించిరో చెప్పక చెప్పుచున్నవి. రాజ్యాశ్వాసము మిగుల చిన్నది. వశిష్ఠ నారదులు రాముని సందర్శించి స్తుతించుటతో నంతమగుచున్నది. మంథర జన్మ వృత్తాంతము నుండి దశరథుడు కైకకు వరము లిడువరకు గల కథా భాగము మాయాశ్వా సమను పేరుతో గ్రథింపబడినది. శ్రీరాముడు మాయామానుష విగ్రహుఁడైన నారాయణుఁడను విషయమును స్పష్టీకరించుటకై ఈ శీర్షిక నొసంగి నట్లాశ్వా సారంభ మందలి క్రింది పద్యమే తెలుపుచున్నది.

మాయను సృష్టించుచు, నా
మాయనె జన్మించి, ప్రకృతి మాయకులోనై
ధ్యేయుఁడవై మసలెడి నా
రాయణ ! త్వ దనంత గుణము లారయ వశమే॥

ఈ యాశ్వాసమునందు రసవంతములైన ఘట్టము లనేకములు గలవు. సాకేత పౌరుల రామ సందర్శనాభిలాషతో సత్యాశ్వాస మారంభమై శ్రీరామ వన ప్రస్థానము వరకు గల కథలో ముఖ్యభాగమునందు సత్య వాక్పరిపాలనము యొక్క ప్రాధాన్య ముపదేశింపబడినది కనుక నా శీర్షిక యివ్వబడినది. వన ప్రస్థానము నుండి భరత విలాపమువరకు పౌరులు, మునులు దశరథుడు, మాతలు, సీతా లక్ష్మణులు, గుహుడు మున్నగు వారందఱు శ్రీరాముని యెడలఁ దమకు గల భక్తి విశ్వాసములను వెల్లడించు ఘట్టములు భక్త్యాశ్వాసము క్రింద చేర్చబడినవి. భరతుడు రాజ్యమును నిరాకరించి భరద్వాజాశ్రమ పథమునుఁజేరి పాదుకల గ్రహించి గృహోన్ముఖుడగు వరకు గల కథా భాగమునందు, భరతుడు శరణాగతుడైన ప్రపత్తి ఘట్టము ముఖ్యమైనది. కావున నీ యాశ్వాసము ప్రపన్నాశ్వాసమను పేరఁబరగినది. మిగత కొలది భాగమున పాదుకా గ్రహణానంతరము భరతుని రాజ్యపాలనా విధాన మభివర్ణింప బడినది కనుక పాదుకా శ్వాసమను శీర్షిక క్రింద గ్రథితమైనది. ఆశ్వాసాంత పద్యములన్నియు శ్రీ ఆచార్యుల వారి పరమ భక్తి ప్రపత్తుల నుద్ఘోషించుచు శ్రీ వైష్ణవ సంప్రదాయమునకు జెందిన యాళ్వారాదుల సూక్తులను స్మరింప జేయుచున్నవి. ఆచార్యులవారిది ధారాళమైన శైలి. ద్రాక్షాపాకము. చంపకోత్పల మాలాది వృత్తములు గంగా ఝురులవలెఁ బ్రవహించినవి. అచ్చటచ్చట ద్విపదలు వింత సొబగును సంపాదించినవి. సహజములైన భావములు, సరళమైన భాష. ఎక్కడను అలంకారములను కృతకముగా జోడించలేదు.

"చ. వడిగల ధారతో మధురభావ పరంపరలన్, మృదూక్తులన్
గడగడ నిక్షుపానకము గైకొని ద్రావునటుల్ రచింతు"

నని యారంభముననే వచించినారు. మధురభావపరంపరలను వడివడిగా వ్యక్తీకరించునపుడు సహజముగా బహిర్గతమగు భాష యప్రయత్నముగా నే తొడవులు దొడిగికొని ప్రత్యక్షమగునో యవియే యలంకారములు. గ్రంథమునందామూలాగ్రము ప్రతి పుటయం దాచార్యులవారి 'వడిగల ధారకును' 'మధురభావ పరంపర'కును. 'సహజమృదూక్తులకును' ఉదాహరణములు కొల్లలుగా కనిపించును.

రామ పట్టాభిషేకవార్త సకలజనులకు సంతసంబు చేకూర్చినను దివిజులకు మాత్రం మది వగ దెచ్చిపెట్టగా వారు వాగ్దేవిని దర్శించి ఈ విధముగా చెప్పుకుంటారు.

ఉ॥ మాకు వరంబు నిచ్చి పరిమార్చఁగ రావణు, జన్మ మెత్తియున్
లోక విభుండు, మాయఁబడి, లోకులు మెచ్చ, నయోధ్య రాజ్యమున్
చేకొన నుండె విస్మృతిని",

చ॥ వనమున కేగకున్న రఘువర్యుఁడు రావణు జంపు టెట్లు ? సీతను
వని రావణుండు తన ధారుణికిన్ గొనిపోవు టెట్లు ? లుర్వినిగల
పెక్కు రాక్షసుల పెంపడగించుట యెట్లు ? భారతీ!

అని వాపోవుచున్నారు. సహజమైన భావము, సరళమైన భాష, వాగ్దేవియొక్క సమాధానము నట్లే యున్నది.

ఉ॥ మీపని దీర్ప, రాఘవుని మేదినికిన్ యువరాజు సేయఁబో
భూపునియత్నమున్, విఫలమున్ బొనరింపఁగ నొక్కకుబ్జయే
యోపు, నయోధ్య నాపడతి, యుండె గదా యదె మంధరాఖ్యతో
నా వెయి కక్ష దీర్చుకొను నాతడు నేడిల నేలజాలునే ?——

ఇందులో మంథరా జన్మరహ్యము సహజముగా బైలుపడినది.

దశరథుడు కోపగృహమందు కైకతో 'నీవు కోరిన ఏ వరమునైన నిత్తు'నని శపథము చేయుచున్నాడు.

శా. ఏ రామున్ గనకుండ నేనొక క్షణం బేనిన్ మనం జాలనో
ఏ రాముండు మదీయ ప్రాణమునకే యెంచన్ గడున్ మిన్నయో,
ఏ రాముండు సదా ప్రియుం "దతనితోడే" నుమ్మిదే బాస : నీ
గాఢాబం ఖదియేమొ తెల్పగదవే, కంజాక్షి నే తీర్చెదన్.

చక్కని నుడికారము. ప్రియతముడైన రాముని 'తోడు'గా బాసచేసి దానినే మఱింత బలపరచుటకై చెప్పుచున్నాడు.

చ॥ పరమ హితాళినిన్ సకల బాంధవులన్, మఱి ప్రాణమేనియున్,
భరతుని వాని తమ్ములను బాసిన బాయగవచ్చుగాని, నా
వరగుణు రామచంద్రు నెడబాయగ జాలను "వానితోడు" నీ
వరమదియేమొ తెల్పుమిఁక, భామరో! తీర్పగ బాసచేసితిన్.

దశరథుని యాజ్ఞగా వనవాస మాదేశింపబడి యంగీకరించిన రాముడు కుపితుడైన లక్ష్మణుని శోకసంతప్తయైన కౌసల్యను సమాధాన పరచి, కైకపై వీరికి సహజముగా జనించు యాగ్రహమునుఁ దొలగించుటకై కర్మ సిద్ధాంత మును ప్రవచించు పద్యములు (పుట. 86-87 పద్యములు 1?1-188) రాముని క్షమాగుణమును చక్కగా సరిపోషించుచున్నవి.

ఈ కావ్యమునందు 'భక్తియొక్క పునాదులపై ప్రపత్తి సౌధము' కట్ట బడినది. కనుక కౌసల్య, సీత, లక్ష్మణుడు, భరతుడు మున్నగువారు శరీర సంబంధములు కల బంధువులేకాక యాత్మ సంబంధులగు భక్తులు ప్రపన్నులు కూడను. కౌసల్యయందు మానవ సహజమైన మాతృప్రేమ యొకవంక లాగుచు ప్రాకృతములగు సంతాప విలాప భావనల నుద్రిక్త పరచుచుండ, మధ్య మధ్య శ్రీరాముడు మాయామానుష విగ్రహుడైన శ్రీమన్నారాయణుని యవతార మూర్తి యను జ్ఞానోదయమగుటచే, భక్తి ప్రపత్తి భావన లావహించుచు తత్త దుచితములగు చేష్టలందు పరిణతము లగుచున్నవి. కౌసల్య ప్రపత్తి ఈ విధముగా వర్ణితమైనది.

ఉ॥ సకల మంగళరూపంబు స్వాంతమందు
పాదుకొన నిల్పె కౌసల్య భాగ్యమేమొ
పుత్రు తనువున గంధంబు పూసి పూసి
అంబ యంత ప్రదక్షిణ మాచరించు.

అటులనే —

తే॥ భక్తభక్తుడు విడలేడు భక్తురాలి
భక్తురాలును విడలేదు భక్తవరదు
బోవుచు ప్రదక్షిణంబున మూడుమూర్లు
సేవ సాయించి సేవించు శ్రీవిభుండు.

మఱియు—

తే. రాము విడనాడజాల దా రామమాత
మర్కట కిశోర విధమున మాత యొప్పు
సంతతిని నోటబట్టు మార్జాలగతిని
తల్లి విడనాడి చనలేడు దాశరథియు

ఈ మర్కటకిశోర మార్జాలకిశోర న్యాయములు ప్రపత్తి సిద్ధాంతము యొక్క అంగములు,

సీతయు 'నేను పతివ్రతయగు భార్యను. భర్తృ విశ్లేషమును ఓర్వ లేను. వనమునకు వెంటదీసికొని పొండ'ని ప్రేమానురాగములను, ధర్మములను వక్కాణించుచు వేమాఱుల ప్రార్థించినది, పిదప 'నేను భక్తురాలిని. నా సేవల గొని కృతార్థురాలినిఁ జేయు'దని బ్రతిమాలినది. తుదకు ప్రపన్నురాలై

తే॥ అన్యథా శరణం నాస్తి" యనెను సీత
జన్మధర్మార్థ మెఱిగిన జనక పుత్రి
భక్తవత్సలుఁడా రామభద్రుఁడంత
కరుణ వెదజల్లి కాంచె నా కాంత సతిని॥

తే॥ స్నేహ మనన ప్రణయ రాగ చిత్తగతిని
కాంత విశ్లేష విరహ దుఃఖంబుఁ బొంది
యంత అనురాగ పూర్ణయై అవనిజాత
మధురభావ మహాభావ మగ్నయగుచు.

స్త్రీ సహజములైన ప్రేమానురాగములు మధుర భక్తియందు పరిణతిజెంది సీత ప్రసన్నురాలైనది.

భరతుడు శ్రీరాముని వనప్రస్థానమును దశరథుని మరణమును తెలిసి కొనిన తరువాత తల్లియగు కైకను దూరునెడ (224-235) ప్రకటింపబడిన భావములును ఉపయోగింపబడిన భాషయు భరతుని హృదయమునుండి వెలువడు కోప సంతాపానల జ్వాలలు ఒక్కుమ్మడి గ్రక్కుచున్నట్లు రసవంతములుగా నున్నవి. భరతునికి భరద్వాజ మహర్షి విందు నొసంగినప్పటి చిత్రము మనోహరముగా నున్నది. మునిపుంగవుడొక మహా సౌధమును యోగబలముచే సృష్టించి, యందు మహారాజోచితమైన విందు నేర్పాటు చేసెను. కాని

చ॥ భరతుఁడు విందునందుగల భక్ష్యము లంటడు, గాన నృత్య సం
భరిత వినోదముల్ గనడు, ప్రాంజలి రాముఁదలంచి ఛత్ర చా
మర మహితాసనంబులకు మాన్యత జూపి, ప్రదక్షిణించి, చా
మరమును బూని కేల, నృప, మంత్రులతో నుపవిష్ణుడై సభన్

తే॥ "దాస భూతోఽస్మి" యనుచు లోదలచు వాఁడు
రామ కింకరు గతి చామరంబు బూని
రాఘవుఁడు పెద్ద గద్దియ రాజిలునటు
లాత్మ భావించి కైంకర్య మంతఁబూనె ॥

ఇట్లు భరతుడుకూడ ప్రపత్తినిఁ బొంది కృతార్థుడై పాదుకలను గొనిపోయెను. రాముడు రాజధర్మములను వేదాంతమును బోధించి వాత్సల్యపూరిత మనస్కుడై భరతు ననుగ్రహించెను. ఈ సన్నివేశము లందంతటయు శ్రీ ఆచార్యులవారి విశిష్ట దృక్పథము స్పష్టముగా కనుపడుచున్నది.

ఆచార్యులవారు తారక మంత్రోపాసకులు. తారక మంత్రమున కారక్షరములు. ఈ షడక్షర సంఖ్య కనుగుణముగా నీ కావ్యమును ఆరాశ్వాసములుగా విభజించి 2016 పద్యములను రెండు సహస్ర నామార్చనల క్రిందను, 294 పద్యములను విశిష్ట క్రిందను జమకట్టి మొత్తము 2310 పద్యములను రచించి కావ్యమును పూర్తి చేసిరి. ఈ సంఖ్య యొక్క కలయిక 6.

దీనివల్ల తిరిగి షడక్షర తారక మంత్ర సంకేతము సంపాదితమైనది. ఈ కావ్యము నామూలాగ్రముగ పఠించి కావ్యదృష్టితో విషయ వివేచన మొనరించి సమీక్షించుటకు తగిన విజ్ఞత నాకులేదు. ఆ కర్తవ్యము సహృదయులగు పండితులది, కవులది, సాహిత్యకులది. అల్పజ్ఞుడనగు నేను నా తోచినయట్లు కొన్ని యభిప్రాయములను వెల్లడించితిని. శ్రీ ఆచార్యులవారిచే నందింపబడిన ఈ రామ కథామృతము నాంధ్ర పాఠకలోకము చవులూర నారగించి నవనవానందము ననుభవించుగాకయని కోరుచున్నాను.

బర్కత్‌పురము
హైదరాబాద్
2-6-63.

# గంగాపురం హనుమచ్ఛర్మ

# దుందుభి

శ్రీ గంగాపురం హనుమచ్ఛర్మ గారు మహబూబు నగరము జిల్లా కలవ కుర్తి మండలములోని గుండూరు వాస్తవ్యులు. స్వమండలమందు జన్మించిన యువకవులును సాహితీసేవకులైనందువలన నాకాప్తులు స్వకీయులును. 'దుందుభి' యను నీ ఖండకావ్య శీర్షికను జూచి ఏ మహాయుద్ధము యొక్క రణభేరిని ప్రయోగించిరో యువకవులని యొకక్షణ మాత్రమాలోచించి పుటలను విప్పిచూడ 'దుందుభి' యనునది సామాన్యముగా నందరు 'డిండీ' యను పేరుతో నెరిగిన మన జిల్లాలోని జలాశయాధారమగు 'నది' యని గ్రహించి యాశ్చర్యా నందమగ్నుడనైతిని.

శ్రీశర్మగారు కొందరభ్యుదయకవులవలె నస్పష్టమును నవేద్యమునగునే విచిత్రమగు సంకుల మనోభావమునో పురస్కరించుకొని యంతకంటె నస్పష్ట మగు పదబాహుళ్యము యొక్క పులుముడుచే చమత్కరించుటకు పూనుకొనక నెల్లపుడు దనశీతలవాహినులచే జలసేచన మొనర్చుచు నాహ్లాదానంద పూరితము లగు జనాంతరంగముల సమాదరణమునుఁ జూరగొను 'దుందుభి' యను నదీ మూర్తిని నాయికగా నొనర్చి తద్వర్ణనకై తమ ప్రతిభావ్యుత్పత్తుల నుపయోగించిరి. ప్రకృతిని మించిన కవితా వస్తువుండదు గదా! ప్రకృతి యొక్క విశ్వ రూపమే విశ్వకవిత కాధారభూతము. మానవుని మానసిక ప్రవృత్తులు, బౌద్ధిక తర్కములు, నైతిక సూత్రములు, ఆధ్యాత్మికచింతనలు మున్నగునవి కవి కుపాదేయ వస్తువులైనను, రమణీయతా ప్రధానమగు కావ్యశిల్పమునకు ప్రకృతికంటె మించిన యుపకరణములేదు. ప్రతిభాశాలియగు కవి జడ ప్రకృతికి సంపూర్ణ మానవత్వము నాపాదించి, శిలలను పలికించి, జాలను గరగించి, నదులను నటింపించి, వృక్షముల నడపించి పికములఁ బాడించి, విశ్వజనీనమగు నిర్మలానంద రసోదయమున కాస్పదమగు కావ్యశిల్పమును సృష్టించగలడు. శ్రీశర్మగారదియే యొనరింపఁ బ్రయత్నించిరి.

'దుందుభి' యొక చిన్నపాటి నదీమతల్లి. ముక్కారు పంటలను పండించి గ్రామ జీవనమును సుఖప్రదముగా నొనర్చు కల్పవల్లి. కవి యూహాలో దుందుభి యొక్క యస్తిత్వమునకును, నది ఋలకరించు నేలల ప్రజాజీవనమునకును అవినాభావసంబంధము గలదు. నీదుకీలు - కోతకొడవలి తళుకు కొనగల్లు పదును; నీదు చదును - పండుకసవుల మేయు బసవన్నరంకె; నీదులంకె - తీరు తీరావులను తియ్యన్ని పాలు; నీదుజాలు - బర్రె పొదుగులు గుంయు బలుపాల మ్రోత, నీదుఊత - గుజ్జాల డెక్కలను కుదురైన బలము, నీదు ఫలము - కలముతో జగమేలు కవివరుని వ్రాత- ఇంకేమి కావలయును. కవి గారు దమ భావనాశక్తిని, శిల్పావేశమును, ప్రేరేపించిన వస్తువును స్పష్టముగా నిర్దేశించినారు.

"ప్రవహింతువా దుందుభీ, మాసీమ, పాలయేరుగ దుందుభీ"

విశ్వనాథ వారి 'కిన్నెరసాని' దాశరథిగారి 'మంజీరను' దలపించు ఛాయలతో నడిపించుచు నదీమతల్లి 'యనంతరిగి' కొండలనుండి పుట్టి మార్గ మధ్యమున పేరులు మార్చుకొని ఎన్నియో మలకలందిగిరి 'గుండ్లపల్లి' వద్ద జలాశయమును నిర్మించుకొని కృష్ణలో గలియువరకు దాని పుట్టుపూర్వోత్తరములను హృదయంగమముగా వర్ణించిరి.

'వల్మీక సుషిరాల వారిధారల ముంచి;
క్రొన్నాగు పడవలకు క్రొత్తభంగిమనేర్పి...." 7

ప్రవహించినది 'దుందుభి'.

'పొగడ పూవులు దాల్చి, పొంగి పొంగి గమించి,
ఇసుక దిబ్బలదూరి, బుసకొట్టి బుసకొట్టి....' 8

పురోగమించినది.

ఈ నదీ ప్రవాహము కాలప్రవాహము యొక్క ప్రతీకము. ఐతిహాసిక మగు మానవ జీవితము ననుప్రాణిత మొనర్చు సజీవశక్తి - అందువలన 'పరుస వేదీశ్వరుని పాదాలు చుంబించి' 'దేవసేన'గ మారినది. 'త్రైలోక్య పల్ల

భూపాలుని', గభీర మంత్రాంగ నైపుణులకు 'పర్వతమ్ముల జీల్చు ప్రౌఢి మను రువ్వేసినది' కాలానికెదురీదు కఠిన శక్తులు తాము నామావశిష్టమై నశియించుటో' యను సూక్తికిఁ దార్కాణమై 'ఎదురుదాకి నిల్చిన పొదల కూకటులఁ బెకలించి'నది, రంగురంగుల మారు రమణి' యై పులిన జఘనమ్ముపై వరద వసనము దాల్చి' 'అలుపు నిలుపులు లేని యార్భటిని' పయనించినది. సాక్షాత్కరించిన యీ నదీ దేవతను కవి "కరుణలేని శ్రీగర్భుల కరకు కోరలలో నిరికి' కొరగావి నిజాయితిలో దరిగానని సంస్కృతికై, పరిపరివిధముల పొరలెడి దరిద్రాశ్రు కణధారవా?" యని ప్రశ్నించినారు. వేయేల "దుందుభి"నది కవి యొక్క సంస్కార జనితములగు నెల్ల మనోభావముల ననుసరించి వారు కోరినట్లు ప్రవహించినది. కావ్యము మిగుల ముచ్చటగా నున్నదనుటలో సందియము లేదు.

వర్ణిత ప్రాంతము యొక్క చరిత్ర యందరకు సుపరిచితమైనది కాదు. శేషాద్రిరమణ కవులలో నొకరగు శ్రీమాన్ దూపాటి వెంకటరమణాచార్యుల వంటి పరిశోధకులు మాత్రమే మెరుగుదురు వారే యీకృతికి పరిచయము గావించుట మిగుల ముదావహము. శ్రీ శర్మగారు తత్ప్రాంతీయ ప్రాచీన చారిత్రక స్మృతులను మృదు మధురమగు నీ కావ్యమునందు సంగ్రథించుట ఎంతేని ప్రశంసనీయము. జాతీయభావనా సంస్కారముగల యువకవికి సహజము. ఎందరో రాచరికము లొనరించిన భూపాలురును, సాహితీ సేవలొనర్చిన కవిపండిత పుంగవులును 'దుందుభి' యొక్క యిరు ప్రక్కల వెలసినవారు. వీరందరి కాలవాహినితోబాటు నీ నదీవాహినితో సన్నిహిత సంబంధమున్నందుచే కవియొక్క స్మృతిపథమున తావు లభించినది. కవిమాటలలోఁ బలుకవలెనన్నచో.

> ఆరిన ప్రాజ్యవైభవము లన్ని యుగమ్ముల సంస్కృతీయ సం
> భారముల న్వహించి, పలుభావములం దలపించి....; 26

'దుందుభి'ని సంబోధించి వ్రాసిన గీతవృత్తములన్నియు కవియొక్క యనర్గళ ధారాసంపదను లలితభావనా పరంపరను వాగ్వైఖరీ విలాసమును వ్యక్తపఱచుచున్నవి. మచ్చుకు నాలుగు పద్యముల నుదాహరించు చుంటిని. అవి చాలును.

కూళలు కొందరేవొ తమకోసము శాసనముల్ సృజించి భూ
గోళము నాక్రమించుకొని క్రొవ్వగ వారి విలాసఘట్టనన్... '32

అవమతిలేదు నీ యెద రహస్యపు వేళలనైన శైవవై
ష్ణవముల పైన దానికి లసత్తులసీ ద్రుమపాళి....' 44

కొత్తగ కాపురమ్మునకు కోమలిదెచ్చెడు కోడెకాడు తా
సత్తకు మామకుం గురుచలాడక నిన్ను తరించు వేళ మో....'59

ఉగ్గున శౌర్యముంగరచి ఉమ్మడిగా పులిపాలు ద్రావి కా
రగ్గి గ్రసించి తీవ్రతకు హాలహలమ్మును బుక్కిలించి....' 61

పై పద్యములలో కవికి గల దీనజనానుకంపయు, మత సామరస్య భావమును, లలిత శృంగార రసజ్ఞతయు, వీరోచితావేశమును, వెల్లడియగుచున్నవి. తోడ్తోడ నన్నిరసముల బోషింపగల కవి యొక్క సామర్థ్యము వ్యక్తమగుచున్నది. వర్ధమాన ప్రతిభులగు నీ యువకవిని హృదయపూర్వకముగా నభినందించుచు నితోధిక పరిపక్వ సాహితీ సేవాభాగ్య ప్రాప్తికై భగవదనుగ్రహము నాశంసించుచు, సాహితీలోక మీ లఘుకృతిని శ్రీ శర్మగారి ప్రథమ పుష్పాంజలిగా స్వీకరించి యాదరించునని విశ్వసించుచున్నాను.

రుతిచూరు
21-4-1960

# కలుగోడు అశ్వత్థరావు

# అశ్వత్థ భారతము

భారతరామాయణాదులు వేదోపనిషదర్థములను సోదాహరణముగా ప్రవచించి మానవకోటికి ధర్మార్థకామమోక్షరహస్యములను సులువుగా దెలుపునట్టి మహేతిహాసములు. అందు భారతము పంచమవేదమునా బరగు ప్రధానేతిహాసమగుటచే భారతావనియందంతట నాబాలగోపాలమునకు సుపరిచితమైన గ్రంథము. దీనిని వివిధ భారతీయభాషలలో నేదోయొకస్వరూపమున పరివర్తన మొనర్చి ఆయాభాషాసాహితీవేత్తలు లోకోపకార మొనర్చిరి. ఆంధ్రమున కవిత్రయముచే రచింపబడిన మహాభారతము సుప్రసిద్ధము. సర్వమాన్యము. ఆంధ్రభాష ప్రపంచమున ప్రవర్తిల్లునంతవరకు నా మహాగ్రంథము చిరస్థాయియై భారతాంధ్రీకర్తలగు మహాకవుల యశశ్చంద్రికలనేగాక యాంధ్రజాతియొక్క ప్రతిభను జగద్విదిత మగునట్లు ప్రసరింపజేయుచుండు ననుటలో సందియము లేదు.

వ్యాసప్రోక్త మగు మహాభారతము పదునెనిమిది పర్వములు గల బృహద్గ్రంథ మగుటచేత నాంధ్రీకర్తలకు దమ యనువాదమును సంపూర్ణ మొనరించుటకు దాదాపు మూడుశతాబ్దముల కాలము పట్టినది. తరువాత గడచిన యైదు శతాబ్దముల కాలమునందును ప్రతిభావంతులగు మహాకవులు పలువురు మహాకావ్యములను వ్రాసిరి. కాని భారతకథను సంపూర్ణముగా తిరిగి కవనించుటకు సాహసించలేదు. తదంతర్గతములగు నాఖ్యానములను, ఉపాఖ్యానములను కథావస్తువుగా గొని కావ్యములను ప్రబంధములను రచించి సంతృప్తి జెందిరి. కాని యంతకుపూర్వము స్వతంత్రించి సంపూర్ణముగా భారతేతిహాసము నెవరును రచించినట్లు నా ఎరుకకు రాలేదు. శ్రీ కరణం అశ్వత్థరావుగారు యట్టి సాహస మొనర్చిన యాధునికకవులలో ప్రథములుగా నగపడుచున్నారు.

శ్రీ రావుగారు "కవిరాజ" బిరుదాంకితులు. అనంతపురం జిల్లా రాయదుర్గం తాలూకా కలుగోడు గ్రామ వాస్తవ్యులు. [illegible] రామాయణము, సీతా [illegible] మున్నగు [illegible] అందరికి సుపరిచితములై [illegible]
[illegible]

భాషలో సుప్రసిద్ధమగు "అనుభవామృత" మను వేదాంత గ్రంథముయొక్క పద్యానువాద మొనరించి ఆంధ్రపాఠకలోకమున కందించి పండితులయొక్క యాదరాభిమానములకు పాత్రులైరి. పురాకృతసుకృతభాజనులై ప్రతిభా వ్యుత్పత్తి గల రావుగారు అశ్వత్థభారతమును రచింపబూని విరాటపర్వము వరకు పూర్తిచేసి ప్రకటించి యున్నారు. శేషించిన పర్వములను త్వరగా పూర్తి గావించి సంపూర్ణభారతేతిహాసమును తిరిగి తెలుగున ప్రపంచించిన యశము నార్జించెదరని విశ్వసించుచున్నాను.

భారతకథ సాగరమువంటి విస్తారముగలది. విస్తీర్ణతకు భారతము పెట్టినపేరు. అంతటి మహేతిహాసమును సంక్షిప్తమొనరించి, ప్రముఖస్థాయిని వహించుచున్న యాఖ్యానోపాఖ్యానముల సారమును విడనాడక సువిధమగు రస వత్కావ్యమును రచించుట కష్టసాధ్యమని కవితాపీఠములందు చరించు సాహిత్యకులేకాక సహృదయులగు పాఠకులును అంగీకరింపక తప్పదు. విరాటపర్వాంతమువరకుగల భారతకథను చిన్నసైజు 75 పుటలలో కుదించి శ్రీరావుగారు తమ సామర్థ్యమును రుజావుసేసుకొన్నా రనుటలో సందియములేదు. ఇటి సంక్షిప్తకావ్యమగుటచే దీనిని వ్యాసప్రోక్తమగు సంస్కృతమూలముతోగాని నన్నయాదిమహాకవుల ఆంధ్రమహాభారతముతోగాని పోల్చి కవి రచనావిధానమును లేక కవితాసామర్థ్యమును పరామర్శింపబూనుట యన్యాయమగును. విహంగమదృష్టిని సారించి నేను కొన్ని భాగములను చదివి చూచితిని. కవనము బహుళ ధారాశుద్ధి గలిగి నాతికఠినమైన సరళశైలిలో కొనసాగినది. తెనుగుసుడికారమునకు ప్రాముఖ్య మొసంగబడినది. బృహద్గ్రంథములోని ముఖ్యాంశములను పంచమవేదముయొక్క ప్రయోజనమును దృష్టిలోనుంచుకొని కవిగారు సరిగా నుల్లేఖించిరా లేదా యనువిషయమును పూర్తిగా పఠించి మూలముతో పోల్చి చూచిన గాని తేటపడదు. అంతటి సామర్థ్యముగాని యవకాశముగాని నాకు లేనందున యాపని పండితులకును, విమర్శకులకును వదులుచున్నాను. ఏదియెట్లున్నను శ్రీరామగారి నీ ప్రయత్న మొనర్చినందులకు హృదయపూర్వకముగా నభినందించుచు, ఆంధ్రసాహిత్యోద్యానము వారినవోదిత కావ్యకుసుమ పరిమళముచే సువాసితమై పాఠకలోకమున కామోద మొనగూర్చుగాత యని యభిలషించుచున్నాను.

లక్నో
24-9-1960

# యజ్ఞవేది

# విజ్ఞప్తి

అజ్ఞానతిమిరాంధస్య - జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితంయేన - తస్మై శ్రీగురవేనమః ।

'యజ్ఞవేది'కి తొలిపలుకు వ్రాయ నాతరమాయని శంకించుచుండ భగవదాజ్ఞయైనదని సందేశమందినది. శిరోధార్యమైన ఈయాజ్ఞను పరిపాలించుటకై సమర్థత కలదాయను విచికిత్సకిక తావులేక పోయినది. 'మూకంకరోతి వాచాలం' అనుసూక్తి పలుమారులు ఉభయార్థములలో స్వానుభవసిద్ధమై యున్నందున శ్రీభగవానుని యవ్యాజానుగ్రహ ప్రసాదితమైన ఈభాగ్యమును కూడ నిశ్శంకతో ననుభవించుచున్నాను.

అది శుభకృద్వత్సరము. శరన్నవరాత్రమహోత్సవకాలము. అశ్వయుజ శుద్ధ తదియ సోమవారము, ఉదయము 9.30 గంటలకు భక్త బృందపరివృతులై, వివిధమంగళవాద్యములతో, భూషణాలంకృత కౌశేయధారిణియగు కపిలగోమాత పురస్సరమై నడచుచుండ, వేదస్వస్తి గావించుచుండు విప్రోత్తముల మధ్యమున, మంగళద్రవ్యములతో సువాసినీజనమనుసరించుచుండ, శ్రీశ్రీ భగవాన్ బాబాగారు యాగశాల ప్రవేశమొనర్చిన శుభసన్నివేశము మఱపురాని యొక యపూర్వమైనఘట్టము. అపుడు ప్రశాంతినిలయావరణమొక స్వర్లోకఖండముగా గోచరించినది. బాబావారియనుచరులమగు అస్మదాదులకది యానందాతిరేకము చే రోమాంచితము ననుభవింపజేసినది.

శాస్త్రోక్తముగా తూ-చ-తప్పకుండా విధిప్రకారము నిర్మింపబడిన యజ్ఞశాలలో నాంధ్రదేశమందలి వేదవిజ్ఞానఘనులైన మహాపండితులును, నిఖిల శాస్త్రపారగులను, వేలకొలది సంఖ్యలో నేకత్రితులైన ప్రేక్షకభక్త బృందముల

సమక్షమున, వారమురోజులు, కర్తలు కారయితలు భోక్తలుకూడాయైనట్టి భగవానుని సాక్షాద్యాజమాన్యమున, అత్యంతశ్రద్ధాభక్తులతో సంపూర్ణనిష్ఠతో జ్ఞాన యజ్ఞ కార్యకలాపమును జరిపి పునీతులైరి. ఇట్టి మహదవకాశము లభించినందు లకు వారు ధన్యులు,

## యజ్ఞ స్వరూపము

ప్రజాపతి సృష్ట్యారంభకాలమందు ప్రజలను యజ్ఞముతో సృజించి 'మీరీ యజ్ఞముల నాచరించి మీయిష్టకామ్యములను తీర్చుకొనుడ'ని మానవులకు బోధించెను.

శ్లో॥ సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వాపురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వం ఏషవోస్త్విష్టకామధుక్॥—

అని గీతావాక్యము. దీనినే శ్రీశ్రీ బాబాగారు 'శ్రీవేద పురుషసప్తాహజ్ఞాన యజ్ఞమహోత్సవము'నారంభించునపుడు తమ యమృతవాక్కులలో నీవిధముగా వ్యాఖ్యానించిరి.

"ప్రపంచములో క్రిమికీటకాదులు మొదలుకొని మనుష్యులవరకు అన్ని జీవులు ఎప్పుడూ యజ్ఞమును చేస్తూనే ఉంటాయి. యజ్ఞమంటే త్యాగం; త్యాగమే దాని అర్థం. తెలియకచేసే యజ్ఞముకంటె తెలిసిచేసే యజ్ఞమే ముఖ్యము. జీవనమంతా యజ్ఞమయము చేసికోవాలి. అప్పుడే ఆత్మకు శాంతి దొరుకుతుంది!"

శ్లో॥ "అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్న సంభవః"

అను గీతార్థమును శ్రీ బాబావారు యజ్ఞారంభమపు డిట్లు శలవిచ్చిరి: "ఈదినము సూర్యోదయానికిముందే ఆనందోదయమైనది. ఆనందంవచ్చేది ఆహా రంనుంచి ఆహారానికి వర్షం కావలయును. వర్షమునుకురిపించేది యజ్ఞము, యజ్ఞం కర్మనుంచివచ్చినది కర్మములన్నింటికిని వేదమే మూలం" వేద మన్నను బ్రహ్మమన్నను ఒకటే. కర్మ బ్రహ్మ (వేదము) నుండి పుట్టినది

కాబట్టి బ్రహ్మ నిత్యము యజ్ఞమునందే ప్రతిష్ఠితమైయున్నది. పైవాక్యములలో బాబాగారు యజ్ఞమునకును వేదమునకునుకల పరస్పరసంబంధమును విశ్లేషించి చెప్పిరి.

## వివిధయజ్ఞములు

శ్లో॥ దేవాన్భావయతానేనతే దేవాభావయంతువః ।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥

'ఈయాగములచే మనుష్యులు దేవతలనారాధించవలెను. దేవతలు వారికి శ్రేయస్సుల నివ్వవలెను. ఈవిధముగా వారు పరస్పర ముపకరించుకొనుచుండవలయును'. ఈ గీతావాక ప్రకారము మానవులకు దేవతలనుకుపరస్పరాశ్రయత్వముకలదు. జీవులకును జగత్తుకునుకూడ నీ సంబంధమే కలదని స్పష్టమగుచున్నది.

యజ్ఞము లైదురకములుగాఁ జెప్పబడినవి. దేవయజ్ఞము, మనుష యజ్ఞము, భూతయజ్ఞము, పితృయజ్ఞము, బ్రహ్మ యజ్ఞము. వీనినే మరొక రకముగా —

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞాయోగయజ్ఞాస్తధాపరే ।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చయతయ స్సంశితవ్రతాః ।

అను గీతాశ్లోకము వివరించుచున్నది. అట్లే కొందఱు ప్రాణాయామపరులు ప్రాణాపానగతులను బంధించి, అపానమునందు ప్రాణమును, ప్రాణమునందపానమును హోమముచేయుదురు. మరికొందఱు నియతాహారులై ప్రాణములను ప్రాణములందే అర్పింతురు. సర్వయజ్ఞములకు సారాంశము నిగ్రహమే కనుక నన్నియజ్ఞములు నాత్మాభివృద్ధిహేతువులే. బహువిధములగు నీయజ్ఞములు బ్రహ్మముఖమునుండి వ్యాప్తములైనవి. ఇవన్నియు కర్మజములు. అట్లెరిగినవాడే విముక్తుడగునని గీతాప్రబోధము. ఇంతేకాక వివిధయజ్ఞములయొక్క బాహ్యప్రయోజనములను వివరించి వాని నాచరించుట లోకధర్మమగుటచేత నవి యవశ్యకర్తవ్యములని నిరూపించుచు గీతాచార్యులు వైదిక యజ్ఞము నాత్మజ్ఞానదృష్టితో విశాలభావసమన్వితమొనర్చిరి.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్ ।
బ్రహ్మైవతేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥

అను శ్లోకములో బ్రహ్మభావముతో నొనరింపబడు బ్రహ్మ యజ్ఞము యొక్క యుత్కృష్టఫలము విశదీకరింపబడినది. ఎవడు హవిస్సును, అగ్ని హోత్రమును, తనను, తానొనర్చుయజ్ఞమును, బ్రహ్మభావముచేఁ దలంచునో, వాడుపొందుఫలము కూడ బ్రహ్మమేయని వక్కాణింపబడినది.

శ్లో॥ దైవమేవాపరేయజ్ఞమ్ యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నావపరే యజ్ఞమ్‌యజ్ఞే నైవోపజుహ్వతి॥

అను శ్లోకములో కొందఱుయోగులు దేవతలనుద్దేశించి యజ్ఞముచేయు దురు.మరికొందఱు బ్రహ్మమనునగ్నియందు, యజ్ఞముచేతనేయజ్ఞము హోమము చేయుచున్నారు'అని చెప్పబడినది. రెండవపాదములోని 'యజ్ఞ'మను పదమునకు 'ఆత్మ'యని శంకరులర్థము చెప్పినారు. ఈప్రకరణమున చివరకు గీతోపదేశమిది.

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞ పరంతప!
సర్వం కర్మాఽఖిలం పార్థ, జ్ఞానేపరిసమాప్యతే॥

ద్రవ్యసాధ్యమైన యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠతరమైనది; ఏలనన సర్వకర్మలు జ్ఞానమునందే పరిసమాప్తములగుచున్నవి. ఈగీతోపదేశము జ్ఞాన యజ్ఞముయొక్క శ్రేష్ఠత్వమును నిరూపించుచున్నది అందువలననే శ్రీభగవానుడు స్వయముగా వేదపురుషుడై వారమురోజులు శ్రేష్ఠతమమైన జ్ఞానయజ్ఞమును జరిపించిరి. భగవానునికి స్వయముగా నభిలషణీయమైన వస్తువుగాని, ధర్మజ ములగు నీయజ్ఞములవలనకలుగు ఫలముగాని, ఏమియులేదు. లోకసంగ్ర హార్థమే ఈయజ్ఞ ముద్దేశింపబడినది. దీనివలన వేలకొలదిజనులకు యజ్ఞ ఫలములభింపఁజేయుటయేకాక వేదములయొక్క ప్రామాణ్యతను వేదవిజ్ఞానము యొక్క ప్రాముఖ్యమును నేటిసమాజమున పునఃప్రతిష్ఠించుటయే శ్రీబాబావా

సంకల్పము. సిద్ధసంకల్పులగువారి యుద్దేశ్యమేవిధముగా నెరవేరినదో ద్రష్టలకును శ్రోతలకును సువిదితమే,

వేదపూజ : ఈయజ్ఞముయొక్క ముఖ్యకార్యక్రమము సుప్రసిద్ధ ఘనాపాఠీల వేదపారాయణముతో పాటు వేదార్థప్రతిపాదకములగు మహోపన్యాసములు. అన్నిటికన్న మిన్నయైన వమృతప్రవాహరూపములగు శ్రీభగవానుని యుపదేశములు. శ్రీబాబావారు తమయుపదేశములలో జనసామాన్యమునకు సుబోధకరముగా వేదవిహితమైన కర్మాచరణమును ధర్మాచరణమును బోధించుటయేకాక వేదములయెడల నేడు ప్రజలకు గల యుదాసీనతను తొలగించి జనహృదయములో వేదముల ప్రామాణ్యతను, వేదవిజ్ఞానమునుకాపాడి వైదికధర్మముల నాచరించుశ్రద్ధను ధృఢముగా నంకురింపఁజేసిరి. అంతేకాక తమ యుపన్యాసములలో పండితుల మహోపన్యాసముల లోని క్లిష్టమైన విషయములను కరతలామలకములగునట్లు విప్పిజెప్పిరి. మఱియు వారి యోగదృష్టికిమాత్రమే గోచరములైన కొన్ని యపూర్వములగు రహస్యములను అంతరార్థములను విశదీకరించిరి. జనసామాన్యమందు వైదికధర్మములయెడ ప్రబలుచున్న నిరాదరణ మానవకల్యాణమునకే యుపద్రవకరమని నొక్కివక్కాణించుటయేకాక వేదశాస్త్ర విజ్ఞానమును పునరుద్ధరించుటకు కంకణముకట్టి వేదశాస్త్ర పాఠశాలయను గురుకులమును ప్రశాంతినిలయముయొక్క ఆవరణలోస్థాపించి, తమ ధర్మసంస్థాపనయొక్క సంకల్పమును నెరవేర్చుకొనుచున్నారు.

వేదస్వరూపము : 'వేదమంటే జ్ఞానము' - 'విద్ జ్ఞానే' - వేదమునకు శ్రుతియనునది పర్యాయపదము.

శ్రు॥ "అస్యమహతో భూతస్య నిశ్వసితమేవైతద్య దృగ్వేదో
యజుర్వేద స్సామవేద అథర్వాంగిరసః॥"

జగత్కారణమగు బ్రహ్మయొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసములతో వెలువడి బ్రహ్మచే నాలుక వినబడినవి కావుననే వేదములు శ్రుతులు. వేద మహిమ యప్పే

మైనవాక్కు, ఋషులు మంత్రద్రష్టలుమాత్రమే. వేదమునకు "అలౌకికం పురుషార్థో పాయంవేత్యనేనేతి"అని నిర్వచనము చేయబడినది. అలౌకికమైన పురుషార్థములను సంపాదించే యుపాయమును వేదము తెలుపుచున్నదనియర్థము. అంటే ముఖ్యముగా ముముక్షువులకు బుద్ధిప్రకాశమును స్వాత్మజ్ఞానమును కలిగించునదియని గ్రహింపవచ్చును. కాని 'వేదోఽఖిల ధర్మమూలమ్' అను వాక్యము వలనను వేదములు సకలధర్మములకు మూలములై నందునను, జీవాత్మపరమాత్మ సంబంధమునేకాక జగత్సృష్టిస్థితిలయాదులు సర్వమానవధర్మములు మున్నగు సర్వసమస్యలకు తృప్తికరములగు సమాధానముల నొసంగుచున్నవి. లోకమందు పదార్థజ్ఞానమునకు, ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము మొదలగు ప్రమాణములు సాధనములగుచున్నవి. అట్టి సాధనములచే తెలియబడని విషయమును తెలుపునది కాన 'వేద' మని పేరు.

ప్రత్యక్షేణానుమిత్యా వాయుస్తూపాయో న బుధ్యతే
ఏతం విదంతి వేదేన, తస్మా ద్వేదస్య వేదతా ॥

కాని అంతమాత్రముచేత ప్రత్యక్షానుమానోపమానాది సాధనములకు సాధ్యమైనవిజ్ఞానముతో వేదమునకు సంబంధములేదనికాదు. వివిధశాస్త్రములకు మూలముకూడ వేదమే. అందువలననే "వేదముశాస్త్రము ఇవిరెండు మానవునకు రెండునేత్రములు. వేదమే సనాతనధర్మానికి లోకకల్యాణానికి 'వేరు' అని శ్రీబాబావారు సెలవిచ్చియున్నారు గీతాచార్యులదే యుపదేశించుచున్నారు.

తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తేకార్యా కార్యావ్యవస్థితౌ
జ్ఞాత్వాశాస్త్ర విధానోక్తం కర్మకర్తు మిహార్హసి ॥
యచ్ఛాస్త్ర విధిముత్సృజ్య వర్తతే కామ కారతః
ససిద్ధి మవాప్నోతి నసుఖం నపరాం గతిమ్ ॥

విజ్ఞానశాస్త్రములని నేడు పరిగణింపబడు భౌతిక శాస్త్రముల యొక్కపునాదులుకూడ వేదములలో మూలభూతముగా నంతర్గతములై యున్నవి.

వేదములు ముఖ్యముగా నలౌకిక పురుషార్థసాధన జ్ఞానమును ప్రసాదించునవే యైనను లౌకిక పదార్థ విజ్ఞానము కూడ మానవుని జిజ్ఞాసను తృప్తిపరచడము నకేకాక విశ్వాత్మయొక్క సత్యస్వరూప నిర్ణయమునకు తోడ్పడుచున్నవి. అందువలననే వేదాంగములగు షట్ఛాస్త్రములకుగల ప్రాముఖ్యము. పాశ్చాత్యదేశములలో గతశతాబ్దములందు బహుళముగా జరిగిన వైజ్ఞానిక శాస్త్రప్రగతి మానవుని కనులకు మిరుమిట్లుగొలుపుచున్నది ఆ వికాసమంతయు ప్రత్యక్షానుమానాది దృక్ప్రమాణములపై యాధారపడియున్నందున కాలక్రమేణ జరుగుచుండు నూతన పరిశోధనలవలన సిద్ధాంతము లెప్పటికప్పుడు మారు చున్నవి. ఇటీవల పాశ్చాత్య భౌతికశాస్త్రవేత్తలు, అణుశాస్త్రజ్ఞులు, వైద్యశాస్త్ర జీవశాస్త్ర విశారదులు, ప్రత్యక్షానుమానాది ప్రమాణములపై యాధారపడిన తమ పరిశోధనలును సిద్ధాంతములును అసమగ్రములనియు, సమ్యగ్దర్శన మాత్మదర్శనము (Intuition) వలన కలుగుననియు అభిప్రాయపడుచున్నారు. కేవల బౌద్ధిక విచికిత్సవలనకలిగే జ్ఞానము సంపూర్ణసత్యము కాదని నిర్ణయము నకు వచ్చుచున్నారు. విశ్వసృష్టినిగురించిన మనమూల సిద్ధాంతములును, మన జ్యోతిష శాస్త్రసిద్ధాంతములను, జీవశాస్త్రమును గురించిన మనమూల భూతములైన తత్వములును వారి పరిశోధనల వలన ఋజువగుచున్నవని అంగీకరించుచున్నారు. మానసికశక్తులను సత్యదర్శనమునకై వినియోగించుట చేతనే ప్రకృతియొక్క నిజస్వరూపము తెలియునని విశ్వసింప మొదలిడు చున్నారు. మనన్యాయవైశేషిక యోగసూత్రములను తమ శాస్త్ర విజ్ఞానముతో సమన్వయించు నూతన ప్రయత్నమును చేయుచున్నారు. కాబట్టి మన వేదశాస్త్ర ముల విజ్ఞానము నేటి సైన్స్ (Science) యొక్క నూతన పరిశోధనలకు సమీపముగా వచ్చుచున్నది. వారి విజ్ఞానము రాను రాను వర్ధిల్లిన పిదప మన మంత్రదష్టలైన మహా ఋషులు యోగదృష్టిచే దర్శించిన భౌతికాధ్యాత్మిక సత్యములన్నియు సమగ్రసత్యములేయని వారంగీకరించిన తరుణము రావ చ్చును. కనుక మనవేదశాస్త్ర విజ్ఞానమును క్షీణింపనివ్వక పరిరక్షించుకొనుట

భారతదేశమునకే కాదు ప్రపంచమునకే యత్యవసరము. మన ఆర్షవిద్యలలో నిగూఢములైయున్న సత్యములను రహస్యములను క్షుణ్ణంగా తెలిసికొని ఇతరులకు బోధించు శక్తిగల వేదశాస్త్ర పండితులకొఱతను తీర్చవలసిన బాధ్యత సమాజముపై కలదు. ఆ బాధ్యతను సమాజమునరిగా నిర్వర్తింపనందున శ్రీ సాయిభగవాను అందుకు కంకణబద్ధులై ధర్మసంస్థాపనకు పూనుకున్నారు. ఈ మహత్తర బాధ్యతను పంచుకొను భాగ్యము శ్రీ శ్రీ బాబావారి ప్రసాద బలముచే మనందఱికి కలుగుగాకయని ప్రార్థించుచు శ్రీవారికి సహస్రానేక ప్రణామముల నర్పించుచున్నాను.

హైదరాబాద్
6.2.1963 ఓం తత్సత్

## కలుగోడు అశ్వత్థరావు

# సర్వజ్ఞ వచనములు

కన్నడ సాహిత్యము తెనుగు సాహిత్యముకంటె ప్రాచీనమైనది. సుమారు **15** శతాబ్దముల చరిత్రముగల కన్నడ సాహిత్యమునందు అధిక సంఖ్యాక రచయితలు జైనులు. వారు సంస్కృత ప్రాకృత వాఙ్మయ పరిజ్ఞానము కలిగిన పండితులు. రాజాశ్రయమును కలిగి కావ్య రచనము చేయుచుండిరి. ప్రౌఢపాండిత్య ప్రకర్షకై పాటుపడుచు కఠిన శైలిలో ఎక్కువగా ధార్మిక గ్రంథములను రచించి రాజాస్థానములందు మెప్పు వడయుట వారి పరిపాటి. జనబాహుళ్యమునందు తమ ధర్మసిద్ధాంతముల ప్రచారముకొరకు బుద్ధుడు మహావీరుడు మున్నగు ప్రవక్తలు సంస్కృత ప్రాబల్యము గల కాలమందును సులభగ్రాహ్యమగు ప్రాకృత భాషలోనే బోధలు సలిపిరి. ఈ సిద్ధాంతమును స్వీకరించి కన్నడ ప్రాంతమున బహుళ ప్రచారము కల జైనులు దేశీయభాషయగు కన్నడమునే ఉపయోగింపదొడగిరి. ఈ ఉద్యమమునుండియే కన్నడ సాహిత్య ముద్భవించెను. మొట్టమొదట రామాయణ మహాభారతేతిహాసములను పురాణములను మహాకావ్యములను తీర్థంకరుల చరిత్రములను కన్నడములో రచించిరి. గద్య గ్రంథములుకూడా కొన్ని పుట్టినను అవి పండితుల మన్ననలు బొందలేదు. జైనులు కన్నడ సాహిత్యమున కపారమైన సేవగావించి తరువాత వీరశైవులకు మార్గదర్శకులైరనుట అతిశయోక్తి కాదు. కన్నడ భాషాసాహిత్యములకు నిజమైన సౌలభ్యమును సారళ్యమును ప్రత్యేక నుడికారమును సమకూర్చి పన్నెండవ శతాబ్దము నుండి లక్షలాది జనసామాన్యమున కుపయుక్తమగు సాహిత్యమును వేలకొలది వీరశైవులు సంతరించిరి. వీరు సాహిత్య సంప్రదాయములో పరిపాటిగా వచ్చుచున్న గద్యపద్య కృతులనే కాక జనుల నాలుకలందు వాడుకలో నున్న పాటలను, సాంగత్య రగడ, త్రిపది చౌపది మున్నగు దేశీయపద్యప్రక్రియ లనపరిమితిగా వినియోగించి జానపదులందును సాహిత్య పరిచయమును పెంపొందించి హృదయమును వికసింపజేసి నూతన చైతన్యమును ప్రసరింపజేసిరి. ఈ తెగకు జెందిన వాడే సర్వజ్ఞకవి.

వీరశైవవాఙ్మయము ఆంధ్రభాషలో కూడ కలదు. శ్రీ వెంకటరావుగారు "వీరశైవాంధ్ర వాఙ్మయ సర్వస్వము అను గ్రంథమును రచించి ఉపలబ్ధమగు సాహిత్యమును సమీక్షించియున్నారు. పండితారాధ్యులు పాలకురికి సోమనాథుడు మున్నగు కవులేగాక ననేకులు వీరశైవ గాథలను రచించి తెనుగు సాహిత్యమును సమృద్ధమొనర్చిరి. కాని కన్నడ వీరశైవ సాహిత్యము నందొక విశిష్ట ప్రక్రియగా పరిగణింపబడు "వచన సాహిత్యము" తెనుగున మృగ్యమనియే చెప్పవచ్చును. ఈ వచన సాహిత్యము వీరశైవ మత ప్రవక్తయగు 'బసవేశ్వరు'నితో నారంభమైనది. బసవేశ్వరుని వచనముల యాంధ్రానువాదమును చూచియున్నాను. 'వచన' మనగా పలికినమాట. గద్యరూపమైన ఉక్తి విశేషము. నైతిక ధార్మిక భావములను వెల్లడించు సూక్తులు 'వచనములు' అని నిర్వచింపవచ్చును. ఈ 'వచన సాహిత్యము'ను సృష్టించి కన్నడ సాహిత్యమును పెంపొందించినది వీరశైవులు. వారిలో సర్వజ్ఞకవి సర్వోత్తముడు అగ్రగణ్యుడు.

ఈ సర్వజ్ఞకవియొక్క జనన, కాల, దేశ, మత సంబంధములైన వివరములు నిష్కర్షగా చెప్పుటకు వీలులేదు. మాతా పితరులు గురుశిష్యులు మున్నగు విషయములు కూడనట్టే. సర్వజ్ఞుని వచనములయొక్క [illegible] అతనిని గురించి ప్రచారములో వున్న దంతకథలను ఆధారముగాగొని పరిశోధకులు అతని కాలము సుమారు క్రీ.శ. 1600 అని నిర్ణయించుచున్నారు. ఈ వచనములలో నెక్కడను తనయూరు పేరులను గాని తల్లిదండ్రులనుగాని గురువును గాని పేర్కొనలేదు. అంతేకాదు 'సర్వజ్ఞ' [illegible] చెలామణిలో వున్న వచనములన్నియు సర్వజ్ఞ నామ [illegible] ఒకే వ్యక్తి యొక్క రచనలో కావో నిర్ణయించుటకు వీలులేదు. కన్నడ సాహిత్య పరిశోధకులు వేలకొలది వచనముల నుండి కొన్నింటిని శోధించి, సేకరించి ఇవి సర్వజ్ఞునివని ప్రకటించిరి. కాని వాని కర్తృత్వమును గురించి ఇదమిత్థమని నిర్ణయించుటకు సాహసించలేము. ఏ కాలమందైనను ఏ మహాపురుషుని సూక్తులు ప్రజల నాలుకలపై బహుళా ప్రచారమందుచుండునో, వాని ననుకరించు వారు తమ సూక్తులను వాని కంటగట్టుట సాహిత్య ప్రపంచములోని సామాన్యమైన పరిపాటి. అట్లే సర్వజ్ఞుని పేర ఎందరో మహానుభావుల నైతికోక్తులు ప్రచారము నొందినట్లు తెలియుచున్నది. ప్రక్షిప్త భాగములను వివక్షించుట దుస్సాధ్యమైనపని. ఇతనికి 'కాలజ్ఞాని' యను పేరుకూడ కంటగట్టబడినది

ఐన నితని నిజమైన పేరు సర్వజ్ఞుడు కాదు. కాలజ్ఞాని కాదు. ఇతడు నేటి ధార్వార్ జిల్లాలోచేరిన హిరియకెరూర్ తాలూకాలోని కుముద్వతీ నదీతీరమున గల అంబలూరు గ్రామమున జన్మించెను. ఇతని తండ్రి సమీపమునందలి మాసూరు గ్రామ వాసియగు 'బసవరసు' లేక మల్లరసు' అను ఆరాధ్య బ్రాహ్మణుడు. మాడి తల్లి చిరకాలము సంతాన ప్రాప్తిలేని ఇతని తలిదండ్రులు కాశీవిశ్వేశ్వరుని ప్రార్థించి తీర్థప్రసాదము బు స్వీకరించి తిరిగివచ్చి అంబలూరు నందుండిరి. క్రీ శ. 1570లో ఒక మగశిశువు జన్మించ నతనికి 'గుండప్ప'యను పేరిడిరి. రెండు వత్సరములవసిబాలుని విడచి తల్లి దివంగతురాలైనది. తండ్రి ఈ పిల్లవానితో మాసూరులోని కుమ్మరి వీథిలో కొన్నాళ్ళు నివసించెను. పిదప తండ్రియు పరమపదమును చేరగా 'గుండప్ప' అనాథ బాలకుడై పెరుగుచుండెను. వర ప్రసాదుడైన ఈ బాలకుడు శివుని గణనాథులలో నొకడగు పుష్పదత్తుని యవ తారమనియు శైశవమునుండి శివధ్యాన పరాయణుడై నిష్ఠాగరిష్ఠుడై మహా మేధావియు ధారణాశక్తి సంపన్నుడై, ఎవరేదడిగిన దానికి సరియైన సమాధాన మిచ్చుచు సహజ జ్ఞానయోగి యని పరిగణింపబడ జొచ్చెను. ఐనను ఈ సర్వజ్ఞుడను నామము నతడు స్వయముగా జ్ఞానగర్వముచే తగిలించుకొని యుండడు.

సర్వజ్ఞుఁడనువాఁడు గర్వమునసయు నాఁడె !
సర్వులను జేరి నేర్వఁగా నొకటొకటి
సర్వజ్ఞుఁడాయె, సర్వజ్ఞ (ప. (1) )

అట్లే కొందఱభిప్రాయపడినట్లు ఇతరులు తను సర్వజ్ఞుడాయని హాస్య మాడినందుకు వారిని వెక్కిరించుటకై ఈ బిరుదును ధరించియుండడు ఈ వచనములలోని త్రిపదులకు మకుటముగా వాడిన సర్వజ్ఞయను పదమును సంబో ధనగా గ్రహించినచో నది సర్వజ్ఞుడైన శివునికి వర్తించును. 'వినర వేమా' యని వేమన తనను సంబోధించినటులే, 'కహత్ కబీరా' యని ప్రతి దోహా క్రమునకు కబీరుదాసు కలిపినట్లే, బసవలింగులకు సర్వజ్ఞుడగు శివుని సాక్ష్యముగా గొని పరమ శివుని కంకితముగానించినాడని యూహించుటసమంజసమగునేమో!

సంస్కృత ద్రావిడ సాహిత్యములందు నీతి కావ్యములకు కొఱతలేదు. [illegible] మహోపాసక గాథలను ఇతర పురాణ కథలన్ను నీతి మయములే.

శుక్రనీతి చాణక్యనీతి మున్నగు లౌకికనీతి శాస్త్రగ్రంథములు వేరు. పంచతంత్ర హితోపదేశకథలును నట్టివే, ధర్మమును నీతిని బోధించని మహాకావ్యములేదు. ప్రత్యేకముగా సుభాషితములు నీతి శతకములును గలవు. అట్లే కన్నడసాహిత్య మందును పురాణములు, పౌరాణిక కావ్యములు, స్తోత్రములు, శతకములు, వచనములు, కీర్తనలు అన్నియు నీతి ప్రధానములైనవే. తమిళములో తిరుక్కురళ్ ప్రాచీనమైనది. తెలుగున వేమనయోగి శతకము సర్వజ్ఞుని కంటె తరువాతిది. సర్వజ్ఞుని ఆ కన్నడుల తిరువాళ్వార్‌గను వేమనగను పరిగణింప వచ్చును. సాధారణముగా కేవల నీతి ప్రధానమగు కావ్యము నీరసమై, నిర్జీవమై ఉత్తమ కావ్యలక్షణముల కనువుగా సామగ్రికలదై యుండుననుటలో సందియములేదు, కావ్యగుణ నిరూపణ చేయునపుడు కావ్య వస్తువునకెంత ప్రాధాన్యత గలదో కావ్యరీతులకును స్వరూపములకును అంతే ప్రాధాన్యత కలదు. రసికుడగు కవి చేతులలో కసువైనను రసమగును. అరసికుడైన వాని చేతులలో రసమైనను కసువగును. రసికతయే కవియొక్క జీవము. సర్వజ్ఞునియందది కావలసినంత కలదు. కావుననే యతని నీతి కావ్యము ఉత్తమ కావ్యశ్రేణికి జెందినదిగా పరిగణింపబడుచున్నది.

సర్వజ్ఞుడు రసికుడనుట కనేక యుదాహరణములు చూపెట్టవచ్చును. ఈ క్రింది పద్యములు చాలును.

తెలియుట సమస్తమును, దెలివి పరుఁడనఁబడుట.
వలపు చెలి నరసికూడుటయు విశ్వమున
గలుగ దెల్లరకు -
అంగనలు వలచుటయు, బంగారు దొరకుటయు,
సంగరము జయము గలుగుటయు నివిమూడు
సంగమేశు కృప.

ఐనను భర్తృహరి మున్నగు వారివలె శృంగార శతకములను వ్రాయలేదు. కాని వచనములదెల్ల ఖణ్ణమైన వ్యవహారజ్ఞానమేగాక ప్రాపంచిక జీవితానుభవ రసము అపతిల్లుచు మార్మికములైన జీవిత రహస్యములు కొల్లలుగా కనపడుచుండును.

ప్రాచీన కాలమునుండి మన దేశము నందు ముఖ్యముగా ధర్మమునకు ప్రాధాన్యత కలదు జనులు పుణ్య పాప స్వర్గ నరకములందు దైవము పర లోకమునందును విశ్వాసము కలిగియున్నారు. మోక్షమే పరమ పురుషార్థమనియు దానికై ధర్మమే ముఖ్యసాధన మనియు నమ్మిక కలిగిన వారు. ధర్మమునకు విరుద్ధముగా కాని అర్థకామములు కూడ పురుషార్థములుగానే పరిగణింపబడి మానవునకు సేవ్యములేయైనవి. అట్లే మోక్షసాధనములగు భక్తి జ్ఞాన వైరాగ్య ములతోపాటు ఇహలోక జీవనమునకు సదాచారము లౌకిక నీతిగా బోధింప బడినది. ఈ పరిపాటి ననుసరించి వీరశైవ వచన కారులును ధర్మ, అర్థ, కామ, మోక్ష, నీతి, జ్ఞాన సదాచార, సద్గతి మున్నగు లౌకిక పారమార్థిక విషయములను పురస్కరించుకొని వచన రచన చేసినను తమ రచనలలో నే విధమైన ప్రకరణ విభజనమును గావించియుండలేదు. అనేక శరణులు తాత్కాలిక స్ఫూర్తి చేత తమ అంతరంగము నుండి పైకుబికి సత్యసారమని తాము విశ్వసించిన మాటలకు నోటబలికిరి. ఒకరి నోట నుండి మరొకరి నోట బడి కొంతకాలమైన పిదప నవి గ్రంథరూపము దాల్చినవి. పుస్తక రూపమున సంపాదించి పెట్టినవారు భక్త 'మాహేశ్వర'మున్నగు విభాగములు గావించి యుందురు. సర్వజ్ఞుని వచనములు కూడ నిట్లే యుద్భవించినవి. కాని ఇవి యతిప్రాస బద్ధములైన త్రిపదములు. అందువలన సర్వజ్ఞుని వంటి వచన కారుడును కేవల స్ఫూర్తిచే నప్రయత్నముగా తన్మయుడై ఎక్కడో పలికిన మాటలని చెప్పుటకు వీలులేదు. కాని ఏ విభాగ క్రమమును మనస్సులో పెట్టు కొని గాని నిర్దిష్టములైన విషయములకు దృష్టియందుంచుకొని గాని వ్రాసినట్లు కనపడదు. ఐనను గద్యవచనముల కందనివి బిగువుగా సొగసుగా నుండి రాగమునందు లేకున్నను మనస్సుకు హెచ్చుగా హత్తుకొని నాటికొని అలరారు చున్నవి.

సర్వజ్ఞుని వచనముల ఈ క్రింది విధముగా విషయాను క్రమణికను చేర్చ వచ్చును.

1. దైవము 2. గురువు, 3. భక్తి 4. జ్ఞానము, 5. సత్యము, 6. సజ్జన -దుర్జన భేదము, 7. ఉపదేశములు 8. దేశము9. ఉద్యోగ జాతులు 10. ధనము, 11. దానధర్మము 12. స్త్రీ & పురుషులు 13. సంసార స్వరూపము 14. రాజధర్మము, 15. ధర్మము. కులమతములు, 16. సంకీర్ణములు.

సర్వజ్ఞుని వచనముల నుండి యతడు వీర శైవుడని నిర్ణయింపనగును. షట్స్థల అష్టావరణ మున్నగు వీరశైవ సంప్రదాయమునకు సంబంధించిన విషయములే కాక శివుని రుద్రుని లింగ స్వరూపమును దైవముగా స్తుతించియున్నారు. అతడు శివభక్తుడైనను అతని చరమ లక్ష్యము కైలాసగిరిపై గిరిజా సమేతుడై కూరియుండు సగుణాత్మకుడగు మహేశ్వరుడు కాదు. అద్వైతమును పాటించి సాలోక్య సారూప్యములకు సంపాదించుట కాదతని పరమార్థము. భక్తియు ధర్మముపైన నాధారపడినను అతని భక్తి విషయము లింగ స్వరూపియైన సూక్ష్మవస్తువు. అది దొరకుటకు గురు సహాయమవసరము. ఈ గురువు విద్యావంతుడుగాని బ్రాహ్మణుడు గాని, మఠాధిపతి కాని ఎవరైనను సత్యసారమును గ్రహించిన వాడైనసరి. శిష్యుడును యోగ్యుడును అధికారియును కావలయును. దేవుడు సర్వవ్యాపి కాపున దేవుని యందు విశ్వాసమనివార్యము. తనలోనే దైవముండును కాన దన యాత్మ వస్తువు కంటె హెచ్చైన యనుభవము లేదు కనుక గుడికి వెళ్ళి ప్రతిమలకు పూజించుట నిష్ప్రయోజనము. రాతి దేవాలయము కట్టి రాతి విగ్రహమును ప్రతిష్ఠించుట, రాయి మీద రాయినుంచుటయే యగును మనుష్యుడు రాయి వలభుడుడు అచేతనుడు కాడు గదా! ఇది నిజమైన పూజకాదు. కాయక్లేశపూజ యొక్క ఫలము జ్ఞానము. అదే పరమ పురుషార్థము. జ్ఞాన స్వరూపియైన పరాత్పర వస్తువు పరమ లక్ష్యమైనను అందరికది సులభసాధ్యము కాదు కనుక భక్తి కావలయును. అదియు శ్రద్ధ తోడను, నిష్ఠతోడను కూడినది. చిత్తశుద్ధి ఏకాగ్రత పూని బాహ్యాచార పురస్సరమైన భక్తి నిరర్థకము. అందువలన పూజా పురస్కారములు, జపతపములు, ప్రదక్షిణ నమస్కారములు తీర్థస్నానములు మున్నగునవి వ్యర్థములు. వీని వలన యజ్ఞానాంధకారము తొలగదు. అంతర్ముఖుడై ధ్యానశీలుడై మానస పూజచేయు సాధకుడు మదవాసియు దేవాలయ పూజారికంటెను ఉత్కృష్టమ ఫలమునకు బదయగలడు. పారమార్థికము బాహ్యాచారములవలన లభింపవు. గంధాక్షతలు విభూతి పట్టీలు ఊర్ధ్వ పుండ్రములు ముద్రలు ధరించినంత మాత్రమున వైదికులు ఆచారవంతులనియు దేవుని మెచ్చిన వారలనియు ఎవ్వరు విశ్వసింపరు. ఈ విధమగు భ్రాంతి వారియందహంకారమును జనుల యందు జ్ఞానము కలుగజేయును. తత్వజ్ఞాని దృష్టిలో పశు పక్షి మృగాదులగు సర్వప్రాణులు సమానము. జ్ఞానికి డంభము డంభాచారము కూడదు. జ్ఞాని

యెన్నడు ఇతరులు తన శిష్యులు కావలెననియు తానువారిని ఉద్ధరించగలననియు తలంపుడు. సర్వసమత నవలంభించి జాతి మత భేదములను పాటించడు. సంసారము నందుండియు సంసారికాడు. ఎప్పుడు తప్పుదారిని నడవడు. ఇది సర్వజ్ఞుని యభిప్రాయములసారము, విధికర్మలయందు విశ్వాసము శమదమాది సంపత్తుల ఉత్కృష్టత సదాచార సత్ప్రవర్తనల యొక్క ప్రాముఖ్యము మున్నగు ననేక విషయములు సూటిమాటలలో చర్చింపబడినవి. వీర శైవ మతసిద్ధాంతములలో ముఖ్యమైనది కుల మత తత్వము నిర్మూలన ముఖ్యమైనది. కనుక కులము కాదు గుణము ప్రధానము. ఈ విషయములన్నియు గ్రంథమున బసవేశ్వరుని సిద్ధాంతములలో నిది సూచవచ్చును.

భారతదేశము యొక్క వివిధ ప్రాంతములలో క్రీ.శ. 15వ శతాబ్దము నుండి 17వ శతాబ్దములోపలి కాలము నందు జ్ఞానభక్తి వైరాగ్యముల నాధారముగాగొని పరంపరగా వచ్చుచున్న బాహ్యాచారములను కుల మత విద్వేష వైషమ్యములను నిరసించుచు మానవుని మౌలికమైన ఐక్యతను చాటుచు పై మూడు మార్గములలోనేదో యొక దానికి ప్రాధాన్య మిచ్చుచు నొక యిష్ట దైవమునకు ఆత్మార్పణ మొనర్చుచు, విశ్వజనీన మైన యొక నూతన మత స్థాపన జరిగినది. జ్ఞానదేవ్, తుకారాం, ఏక్‌నాథ్, రామదాసు, మున్నగు మహారాష్ట్ర సంత్‌లు తులసీదాసు, కబీరుదాసు, సూర్‌దాసు, మీరాబాయి మున్నగు ఔత్తరాహులును. అందరును సర్వజ్ఞునిపై యభిప్రాయములతో ఏకీభవించు సర్వమత సామరస్యమును బోధించిరి. మూఢనమ్మకములను చుట్టుకొని కరడుగట్టి ఘనీభవించిన మతవిషయిక డంబాచారములకు వైషమ్యములకునిరసించిరి. ప్రాచీనులైన నారాయణగార్లు వైష్ణవ ఆళ్వార్లు మున్నగు వారును దాదాపు పై యభిప్రాయములనే వెల్లడించిరి. వైదిక మత ప్రాబల్యమువలన నొకవైపు మత త్రయ వ్యాప్తి జరిగి శిష్టాచారమును పాటించు కొన్ని కులముల వారు కరడుగట్టిన పూర్వాచారములకు కట్టుబడియుండినను జనసామాన్యమున కభిమతమగు మతమే యోగులు జ్ఞానులు సంతులు బోధించిన మతమే. కావుననే శైవ వైష్ణవ బౌద్ధ జైన వాదములు నడచిపోయి అన్నిమతములకు ప్రాణభూతమైన సిద్ధాంతమొకటేయని స్థూలవిశ్వాసము జనానీకమునందు ప్రబలి [illegible] ఇప్పటికి మూలాధారములగు ధర్మ సూత్రములనే ఆధారపడుచున్నవి.

దైవమునందు విశ్వాసము (ఆస్తికత) సత్యము ధర్మము సదాచారము దయాశీలత, పరస్పరప్రేమ మున్నగు నైతిక సిద్ధాంతములపై యాసక్తి ఆస్తేయము అహింస, త్యాగబుద్ధి మున్నగువాని ప్రాధాన్యత. ఇవన్నియు నేటి బహుజన సమాజము యొక్క తాత్త్విక విచారములు. దాదాపు ఈ భావములే సర్వజ్ఞ వచనములందు ప్రతిఫలించుచున్నవి.

కవిరాజు బిరుదాంకితులగు కలగోడు అశ్వత్థరావుగారు సంస్కృతాంధ్ర కన్నడ భాషలలో క్షుణ్ణమైన పాండిత్యము కలిగిన సరసకవులు. వారికిదివరకే 'అశ్వత్థ భారతము' వంటి యుద్గ్రంథమును రచించి ఆంధ్రలోకమున కందించి కృతజ్ఞతకు పాత్రులైనారు. కన్నడ కబ్బములను అనువదించి తెనుగు పాఠకుల కందింప ఎంతేని సమర్థులు. వారి ఈ శక్తి సామర్థ్యములు 'సర్వజ్ఞ వచనముల' యందు బహుధా నిరూపింపబడినది. శ్రీ రావుగారి యనువాదశైలి చక్కనిది. మూలానుసరణముతోపాటు మూలములో నున్న అక్షర రమ్యతను సూటిదనమును కూడా అవతరింపచేసి అనువాదమొక స్వతంత్ర కావ్యముగా భాసించునటుల జేసినారు కవిగారు. ఉదాహరణముల నొసంగి ఇదివరకే దీర్ఘమైన ఈ పీఠికను మరింత పొడిగించక ఈ కావ్యమునకు ఆంధ్ర పాఠకలోకము సుస్వాగతమొసంగుగాక యని కోరుచు విరమించుచున్నారు.

BOORGULA RAMAKRISHNA RAO PEETHIKALU




Published by :
JYOTHIRMAYI (Literary and Cultural Association)
Secunderabad.

Printed at : Madhavi Printers, Hyd-27 Phone : 551259